# అనుకున్నట్లు జరిగే యుగం

కాలం తాననుకన్నట్టే గుండ్రంగా నడుస్తుంది!
వంకరగా పరుగులెత్తడం దాని ఆశయం కాదు!
కనుకనే సూర్యోదయాలూ చంద్రాస్తమయాలూ
ఋతుక్రమాలా గ్రహణాలా తోకచుక్కలూ

"అన్నీ మనమనుకున్నట్టే జరుగుతాయా
మన పెత్రికానీ అలా అలా రాసిపెట్టారు
కనుక మనం అనుకుని అందుకోగలమా
రాసిపెట్టినట్లే అన్నీ జరిగి తీరతాయి"

సర్వత్రా అనుకునే మాటలే సంసారాల్లో
మన దేశం నిండా మనుషుల భావాలు!
ఏటి ప్రభావాలివి? ఎవరు నేర్పిపెట్టారు?
ఎక్కడ పాతిపెట్టారు? ఇలా పెరుగుతున్నాయి?

ఈ జిల్లేళ్ళనూ ముళ్ళపొదలనూ తగలేస్తే
అంటారుగదా "అయ్యో అవన్నీ ఔషధాలు
ఎప్పుడెందుకు పనికొస్తాయో అలా ఉంచండి
కొట్టేయకండి పెరగనీయండి మాటవినండి"

"ఏం వినాలి? మన మనకునేలాగే జరిగే యుగం
వచ్చి తీరుతుంది మంచిపెడ్డల మధ్య హద్దుని
మనం తెలుసుకుని ఆచరిసే ఆ కాలం లాగే!"

— డా॥ మిరియాల రామకృష్ణ




సంపుటి 16 సంచిక : 10

1993

ముఖచిత్రం :

సభ 1919 (లినోకట్)
చిత్రకారుడు : వ్లదీమిర్ కొజ్లిన్‌స్కీ
(చిత్రకారుడు మోహన్ సౌజన్యంతో)

రచనలు పంపవలసిన చిరునామా :

**నిర్మలానంద,**
వర్కింగ్ ఎడిటర్,
29-28-67, దాసరివారివీధి,
సూర్యారావుపేట,
విజయవాడ - 520 002.

కవరు పేజీ రెండవ పేజీలో :

మరణంతో కొత్త జీవం
- డా॥ మానేపల్లి

మూడవ పేజీలో :

అనుకున్నట్టు జరిగే యుగం.
- డా॥ మిరియాల రామకృష్ణ

**139**

ఏజంట్లు, చందాదారులు
వ్రాయవలసిన అడ్రస్,
ఇతర వివరాలకు :

**కొత్తపల్లి రవిబాబు,**
ప్రధాన కార్యదర్శి
జనసాహితి, నగరం-522 268
తెనాలి తాలూకా

★ ★




వెల : రూ. 5 సం॥ చందా రూ. 50
ప్రత్యేక సం॥ చందా రు. 100

## ఈ సంచికలో....

## సంపాదకీయం

# విప్లవ ఐక్య కార్మికోద్యమమే 'మేడే' సందేశం

కుల వ్యవస్థను, వివక్షతనూ పెంచి పోషించిన పాలక వర్గాలు డా॥ అంబేద్కర్ విగ్రహాలకు పూలదండలు వేసి, కులనిర్మూలనా సందేశాలూ ఇస్తారు. మత సామరస్యతనూ, లౌకిక వాదాన్ని గురించి ఏకరువు పెడ్తూనే, మత వాదాన్ని, మతకల్లోలాసూ పెంచి పోషిస్తారు. ప్రభుత్వరంగ ఫ్యాక్టరీలను ప్రైవేటు పరం చేస్తూ, ఆధునీకరణ పేరిట లక్షలాది కార్మికులను ఉపాధి నుండి వీధులపాల్జేస్తున్న వారే 'మేడే' సందేశాలూఇస్తారు. 'శ్రమశక్తి'బహుమతులనూ ప్రకటిస్తారు; "ఉత్పత్తిని పెంచండి. ప్రగతిని సాధించండి" అని శ్రామిక వర్గానికి నీతులు బోధిస్తారు.

'మేడే' దినోత్సవం నుండి కార్మికవర్గం విప్లవ చైతన్యం, సంఘటిత శక్తి పొందకుండా సామ్రాజ్యవాదులకు ఊడిగం చేసే రాజకీయ పార్టీలు, కార్మిక సంఘాలు కార్మికులను ప్రక్కదారి పట్టించేందుకు తమ ప్రయత్నాలు చేస్తూనే వుంటారు. శ్రామికవర్గ రాజ్య నిర్మాణ లక్ష్యంగా, దోపిడి రహిత సమాజాన్ని ఆవిష్కరించే దిశగా సాగే శక్తులు 'మేడే' విప్లవ సాంప్రదాయాన్ని కార్మికుల వీరోచిత పోరాటాల్ని స్మరించుకుంటూ, తమని తాము పోరాటాలకు పునరంకితం చేసుకుంటారు.

1860 సంవత్సరానికి ముందే అమెరికాలోని కార్మిక వర్గం ఎనిమిది గంటల పని దినాన్ని కోరుతూ ప్రారంభించిన ఉద్యమం చికాగోలో 1886 మే 1 వ తేదీన తారాపథాన్ని అందుకుంది. ఆరోజున హే మార్కెట్‌లో జరిగిన సభపైన పోలీసులు సాగించిన పైశాచిక కృత్యంలో నలుగురు కార్మికులు బలైనారు. ప్రభుత్వం ఒక బూటకపు విచారణ జరిపి అమెరికా కార్మికవర్గ నాయకులైన పార్సన్స్, స్పైజ్, ఎంగెల్స్‌లను ఉరి తీసింది. 1890 సంవత్సరం మే 1 తేదీని 'కార్మిక వర్గ అంతర్జాతీయ దినం'గా పాటించ వలసిందిగా పారిస్‌లో జరిగిన అంతర్జాతీయ సోషలిస్టుల సమావేశం తీర్మానించింది. ప్రపంచ వ్యాప్తంగా నాటి నుండి కార్మికవర్గం చికాగో వీరుల బలిదాన్ని స్మరించుకుని, తమ విముక్తి పోరాటాలకు పునరంకిత దినంగా "మేడే" ప్రశస్తిని పొందింది.

ప్రకృతి, మానవ వనరులు, సర్వ సంపదలు గల భారత దేశం అనాదిగా స్వదేశీ, విదేశీ దోపిడిలకు గురయింది. మధ్య యుగాల్లో రాజవంశాలు దేశాన్ని కబళించి పాలించారు. విదేశీ పాలకులు కొందరు సంపదలను దోచుకెళ్ళారు. కాని బ్రిటిష్

సామ్రాజ్య వాదులు భారత స్వయం సమృద్ధ గ్రామీణ వ్యవస్థను చిన్నాభిన్నం చేసి 200 సంవత్సరాలు భారత రైతాంగ, కార్మికుల, చేతివృత్తుల వారి మూలుగుల్ని పీల్చి సంపదలను దోచుకున్నారు. భారత కార్మికవర్గం సామ్రాజ్యవాద ప్రభుత్వపాలనకు వ్యతిరేకంగా, అణచివేత చట్టాలకు వ్యతిరేకంగా హక్కుల పోరాటాలు, రాజకీయ పోరాటాలను వీరోచితంగా సాగించారు. తేయాకుతోటల్లో, బొగ్గుగనుల్లో, జనుపనార, బట్టల మిల్లుల్లో, రైల్వేలలో పనిచేసే కార్మికులు, ప్రధానంగా గ్రామీణ రైతాంగం నుండి వచ్చిన వారైనప్పటికి, పారిశ్రామిక శిక్షణ లేనప్పటికి, సామ్రాజ్యవాదుల క్రూర నగ్న దోపిడికి వ్యతిరేకంగా హక్కులకై పోరాటాలు జరిపి తమ సంఘటిత శక్తిని ప్రదర్శించారు. రెండవ ప్రపంచ యుద్ధం సందర్భంగా, సామ్రాజ్య వాదులు కార్మికులపై మోపిన యుద్ధ ఆర్థిక భారానికి వ్యతిరేకంగా 1940లో బట్టల మిల్లు కార్మికులు వీరోచితంగా సమ్మెచేశారు. ఆజాద్ హింద్ ఫౌజ్ యోధుడు అబ్దుల్ రషీద్ ఉరిశిక్షకు వ్యతిరేకంగా, బొంబాయి నావికా తిరుగుబాటు సందర్భంగా భారత కార్మిక వర్గం సామ్రాజ్యవాదుల గుండెలదరగా పోరాటాలు చేపట్టారు. జాతీయ విముక్తి పోరాటం విజయవంతంగా ముగియాలంటే సామ్రాజ్యవాద వ్యతిరేక శక్తులతో ఐక్య సంఘటనను నిర్మించి, పోరాటాలు చేపట్టే కర్తవ్యాన్ని జాతీయోద్యమ నాయకత్వం ఉద్దేశ పూర్వకంగా విస్మరించింది.

డా॥ అంబేద్కర్ నేతృత్వంలోని దళితుల ఉద్యమాలను, కిసాన్ సభ నేతృత్వంలోని రైతాంగ ఉద్యమాలను, కార్మిక వర్గపోరాటాలను ఉద్దేశ పూర్వకంగా మరల్చుకుంటూ విద్రోహ చర్యలకు పాల్పడి బూర్జువా-భూస్వామిక వర్గాలు సామ్రాజ్యవాదులతో మిలాఖత్ అయినవి. 1947 ఆగస్టు అధికార మార్పిడితో భారత దేశంలో సామ్రాజవాద ప్రభుత్వానికి బదులు రాజకీయంగా, ఆర్థికంగా భారత బడా బూర్జువా-భూస్వామ్య వర్గాలు అధికారాన్ని చేపట్టినవి.

ఆవడి కాంగ్రెసు సభలో సోషలిజం తీర్మానం, మిశ్రమ ఆర్థిక వ్యవస్థ, ప్రణాళికలు ప్రగతిశీలత ముసుగులో పాలకవర్గాలపీడిత మధ్యతరగతి ప్రజల కళ్ళల్లో దుమ్ముకొట్టారు. 'నవభారత నిర్మాత' నెహ్రూ సోషలిజం, సెక్యులరిజం, ప్రజాస్వామ్యం అంటూ భారత పెట్టుబడిదారులకు, సామ్రాజ్యవాదులకు తెలియడానికి కొంతకాలం పట్టింది కాని, శ్రామిక వర్గ రాజ్యం కోసం కార్మిక, రైతాంగాన్ని విప్లవం కోసం నడపాల్సిన కమ్యూనిస్టు పార్టీలు పాలకవర్గాల్లో, పార్లమెంటులో ప్రజాస్వామ్యాన్ని, సోషలిజాన్ని దర్శించినవి. అంతర్జాతీయ కమ్యూనిస్టు ఉద్యమాలకు మార్గ దర్శకమైన 'గ్రేట్ డిబేట్', చైనా సాంస్కృతిక విప్లవం గో నక్సల్ బరీలో రగిలిన సాయుధరైతాంగ ఉద్యమం నుండి భారత కార్మిక వర్గం రివిజనిజం నుండి బయటపడే రాజకీయ తాత్త్విక అవగాహనను మళ్ళీ గుర్తించింది.

40 సంవత్సరాలుగా అమలు జరుపబడిన రాజకీయార్థిక కార్యక్రమాలు అభివృద్ధి పేరిట దేశాన్ని చివరకు ప్రపంచ బ్యాంకుకు, అంతర్జాతీయ ద్రవ్యనిధి సంస్థకు, సామ్రాజ్యవాదుల నిబంధ హస్తాలకు అప్పచెప్పబడిన విధానాలని కార్మిక వర్గం గుర్తించింది

నూతన విద్యావిధానం నూతన పారిశ్రామిక విధానం, నూతన ఆర్థిక విధానం, ఎగుమతి - దిగుమతుల విధానం - అన్నీ నూతనత్వం పేరిట ఉదారవాద ఆర్థిక విధానాల పేరిట, విదేశీ పెట్టుబడులకు, సాంకేతిక జ్ఞానానికి పూర్తి ద్వారాలు తెరువబడినవి. శ్రీమతి గాంధీతో ప్రారంభింపబడిన ఉదారవాద విధానాలు పి.వి. నర్సింహారావు కాలంలో తారా పథాన్ని చేరినవి. దేశంలోని మేధావి. మధ్యతరగతి వర్గం విశ్వాసాన్ని పొందడానికి ఆర్థిక శాస్త్రవేత్త మన్మోహన్‌సింగ్‌ను ఎన్నుకున్నాడు. ప్రపంచ మార్కెట్‌కు భారత ఆర్థిక వ్యవస్థను అనుసంధానం చేయడం అత్యంత వేగంగా ఆర్థిక, ద్రవ్య చర్యలను చేపడుతున్నారు. సమస్త రాజకీయ, ఆర్థిక, సామాజిక సంక్షోభానికి కారణం పాలకులు అమలు పరిచిన విధానాలే. వారికి లోపించిన రాజకీయ నిబద్ధతే. వారికి గల దళారీ స్వభావమే. ఈ క్రమంలోనే 2,50,000 చిన్న, మధ్య, భారీ పరిశ్రమలు మూత పడినవి. 244 పబ్లిక్ రంగ సంస్థల్లో 98 సంస్థలు కోట్ల రూపాయల నష్టంలో కూరుకు పోయినవి. దాదాపు 7 లక్షల కార్మికులు రిట్రెంచ్ కాబోతున్నారు. Exit policy ద్వారా ప్రైవేటీకరణ కార్మికులను వీధుల పాల్జేసే చర్యలకు ఉపక్రమిస్తున్నారు. నూతన పారిశ్రామిక సంబంధాల బిల్లు, టాడా చట్టాలలో సవరణ ద్వారా కార్మికుల హక్కులను, యూనియన్‌ల హక్కుల కాలరాచే చర్యలను చేపడుతున్నారు. పారిశ్రామిక రంగంలో విదేశీ పెట్టుబడికీ, సాంకేతిక జ్ఞానానికీ, పరికరాలకు పూర్తి సౌకర్యాలను, రాయితీలను సమకూర్చి అతిచౌకగా భారత ప్రజల శ్రమను పిండుకునేందుకు సామ్రాజ్యవాదులకు పాలకులు పూర్తి ఊడిగం చేసేందుకు సిద్ధపడుతున్నారు. డంకెల్ ప్రతిపాదనలపై సంతకం చేయమని బలవంతంగా ఒత్తిడి తెస్తున్నారు. తద్వారా వ్యవసాయ రంగం కూడా పూర్తిగా సామ్రాజ్యవాద గుప్పెట్లో చిక్కుకుంటుంది. ఆధునీకరణ, అభివృద్ధి, ఉదారవాద ఆర్థికవిధానాలు, ప్రపంచ ఆర్థికవ్యవస్థకు అనుసంధానం, స్వేచ్ఛా మార్కెటు, ప్రపంచ గమనంవైపు, 21వ శతాబ్ది రాజకీయ ఆర్థిక నినాదాలన్నీ సారాంశంలో భారతదేశం తన సార్వభౌమాధికారాన్ని కోల్పోవడం, సామ్రాజ్యవాదానికి, బహుళజాతి కంపెనీలకు తాకట్టు పెట్టబడడం మాత్రమే. ప్రయివేటీకరణకు, రిట్రెంచ్‌మెంటుకు, లాకౌట్లకు వ్యతిరేకంగా పెద్ద ఎత్తున కార్మికవర్గం పోరాటం చేయక తప్పదు. వెనుకబడిన వ్యవసాయ రంగం, కరువు కాటకాలు లక్షలాది గ్రామీణ ప్రజలు పట్టణాలవైపు వలస వెళ్ళక తప్పని

స్థితి. ఫలితంగా నిరుద్యోగ సైన్యంలో లక్షలాది యువత చేరడం తప్పదు. దళితులపై, గిరిజనులపై, మహిళలపై పెచ్చుపెరిగిపోతున్న అత్యాచారాలకు వ్యతిరేకంగా సంఘటితమై పోరాటాలు వెల్లువెత్తడం, ఉద్యమిస్తున్న పీడిత ప్రజలను నిర్బంధ చట్టాలద్వారా, పారామిలిటరీ బలగాలద్వారా అతిక్రూరంగా అణచివేసే రాజ్యాంగ యంత్రం ప్రజలను విభజించి, చీల్చి, వారిలో వారే శత్రువులుగా మారి కత్తులు కోసుకునే మతవాదాన్ని ఎజెండా పైకి తెచ్చింది. అధికార, ప్రధాన ప్రతిపక్ష పార్టీలు రెండూ మతవాదాన్ని విస్తృతిగా పెంపుదల చేయడంలో వాటి లక్ష్యం సంక్షోభం నుండి బయటపడేందుకు మతవాదాన్ని రాజ్యాధికార సిద్ధాంతంగా ఎజెండా పైకి తెస్తున్నారు. రాజ్యం మరింత నిరంకుశంగా, క్రూరంగా ప్రజా ఉద్యమాలను, కార్మికుల పోరాటాలను అణచివేసేందుకు, ప్రజలను విభజించేందుకు మతవాదం వారి చేతుల్లో ఆయుధమైంది. ప్రముఖ కార్మిక నాయకుడు శంకరగుహ నియోగి దారుణ హత్య రాజ్యాంగయంత్ర వికృత, ప్రజావ్యతిరేక చర్యల్ని తెలిపే ఒక ఉదాహరణ మాత్రమే.

భారత కార్మికవర్గం జాతీయోద్యమ కాలంనుండి పోరాడి సాధించుకున్న హక్కులు, ప్రయోజనాలకు భంగకరమైన పరిస్థితులు నెలకొంటున్నవి. ఆనాడు సామ్రాజ్యవాదులకు వ్యతిరేకంగా కార్మికవర్గం, రైతాంగం చేసిన త్యాగాల ఫలితాలను అధికారం చేపట్టిన బడా బూర్జువా-భూస్వామ్య వర్గం తామనుభవించి, సామ్రాజ్యవాదులకు భారత ప్రజల రక్తమాంసాలు పీల్చుకునే అన్ని అవకాశాలను కల్గించారు. మళ్ళీ నేడు భారత కార్మికవర్గం సామ్రాజ్యవాదానికి వ్యతిరేకంగా, నిరంకుశ పెట్టుబడిదారి వర్గానికి వ్యతిరేకంగా పోరాడకుండా, తనను తాను విముక్తి చేసుకోలేదు. మిగతా పీడితప్రజలను విముక్తి కల్గించలేదు.

పాలకవర్గ, రివిజనిస్టు కార్మిక సంఘాలు కార్మికుల పక్షాన వుంటూనే కార్మిక విద్రోహ చర్యలకు దిగే విధానాలను కార్మికవర్గం గుర్తిస్తుంది. పాలకుల తప్పుడు, దోపిడీ విధానాలను గుర్తిస్తుంది. పోరాడక తప్పదని, పోరాడితేనే సంకెళ్ళు తెగగల వని వారి దుర్భర జీవనం వారికి పాఠాలు నేర్పింది. పోరాడటమే కాదు రాజకీయ లక్ష్యంతో సాగాల్సిన పోరాటానికి ఐక్య కార్మికోద్యమం ద్వారా మాత్రమేనని గుర్తిస్తుంది. కార్మిక వర్గాన్ని విభజించే అన్ని రకాల తప్పుడువాదాలు, భావజాలాల నుండి బయటపడి ఐక్య విప్లవ కార్మికోద్యమం మాత్రమే తమ విముక్తిని సాధించ గలదని పోరాడే క్రమంలో వారు నేర్చుకున్న పాఠాలు.

ఈ మేడే నుండి కార్మికవర్గం క్రొత్త స్ఫూర్తిని పొందాలి. మార్క్సిజం అజేయమని, సోషలిజం అనివార్యమని, పోరాడేవారిదే ఎర్రజెండా అని, శ్రమజీవి

(తరువాయి 56 వ పేజీ)

# 'ఓల్గా నుంచి గంగకు' - ఒక పరిచయం

—కాత్యాయనీ విద్మహే,
జ్యోతిరాణి.

(గత సంచికలో స్థలాభావం వల్ల ఈ వ్యాసం నుండి రెండు పేజీలు ప్రచురించుం. పాఠకుల సౌలభ్యం కోసం మొత్తం వ్యాసాన్ని యిక్కడ ముద్రిస్తున్నాం)

'ఓల్గా నుంచి గంగకు' అనే పుస్తకం విడి విడి కథల రూపంలో వుండి ఆ కథలన్నింటికి మధ్య ఒక అంతర్గత అనుస్యూత సంబంధం వుండి, వేల సంవత్సరాల మానవ చరిత్రను, సంబంధాలను నిరూపించిన ఇతిహాస స్వభావం గల రచన. ఈ కారణం వల్ల ఇది నవలను చదివిన అనుభూతి నిస్తుంది. సమాజ పరిణామ క్రమ చరిత్రను నిరూపించిన గ్రంథంగా ఒక చారిత్రక రచన అనిపిస్తుంది ఈ పరిణామ క్రమంలో భాగంగా ఉత్పత్తి శక్తుల ఎదుగు



రాహుల్జీ

దలను, దానితోపాటు మారుతూ వచ్చిన ఉత్పత్తి సంబంధాలను న్యాయ సంబద్ధతను చేకూర్చటానికి వచ్చిన రాజ్య స్వభావాన్ని నిరూపించిన గ్రంథంగా రాజకీయ అర్థ శాస్త్రాన్ని అధ్యయనం చేస్తున్న అనుభవాన్నిస్తుంది. ఇంత విస్తృతమైన పరిధి నుండి పరిణమించిన 'ఓల్గా నుంచి గంగకు' పుస్తకం ద్వారా రాహుల్ సాంకృత్యాయన్ రాజకీయార్థిక దృక్పథం నుండి ఉత్పత్తి సంబంధాలను, రాజ్య స్వభావాన్ని, మానవ సంబంధాలను, అందులో భాగంగా స్త్రీ పురుష సంబంధాలను అధ్యయనం చేసే వాళ్ళకు దగ్గరి వాడయ్యాడు. ఆయన జీవిత తాత్త్విక దృక్పథానికి ప్రతినిధి రచన అయిన 'ఓల్గా నుంచి గంగకు' పుస్తకాన్ని విశ్లేషించి అవగాహన చేసుకోవటం రాహుల్ సాంకృత్యాయన్ శతజయంతి సందర్భంగా మన బాధ్యత.

జాతీయోద్యమ కాలంలో జైలు జీవితాన్ని అనుభవిస్తూ 1941 లో రాహుల్ సాంకృత్యాయన్ ఈ పుస్తకాన్ని వ్రాశాడు. ప్రస్తుతం భాగంటి తులసి తెలుగులోకి

---

**రాహుల్ జీ శతజయంతి (1893-1993) సంవత్సరం**

---

అనువాదం చేసిన ఈ పుస్తకం విశాలాంధ్ర ప్రచురణగా (1986) తెలుగువాళ్ళకు అందుబాటులో వుంది. ఇందులో ఇరవై కథలున్నాయి. క్రీ.పూ. 6,000 సంవత్సరాల

నుంచీ క్రీ.శ. 1942 వరకు దాదాపు ఎనిమిది వేల సంవత్సరాల మీద సాగిన మానవ కథా వికాసాన్ని సజీవ మానవ సంబంధాల నుంచి రూపు కట్టించిన కథలివి.

మొదటి కథ 'నిశ'. ఓల్గా తీరం ఎగువ భాగాన క్రీ.పూ. ఆరువేల సంవత్సరాల నాటి జీవితం ఇందులో వుంది. మాతృస్వామిక కుటుంబ పెద్ద నిశ. ఆమె నాయకత్వంతో గుంపు వేటాడి ఆహారాన్ని సంపాదించుకొంటుంది. బాణాలు, బల్లాలు వాళ్ళ ఆయుధాలు. సహజంగా ఏర్పడిన కొండ గుహలు వాళ్ళ అవాసాలు. అప్పటికే నిప్పు కనుగొన బడింది. కనుక పాక్షికంగా ఆహారాన్ని కాల్చుకొనో, ఉడక బెట్టుకొనో తినటం తెలుసుకొన్నారు. తల్లి యాజమాన్యం గల ఈ గుంపులో పెత్తనం కోసం స్త్రీల మధ్య పెనుగులాట మొదలైంది.

రెండవ కథ 'దివ'. క్రీ.పూ. మూడువేల అయిదు వందల సంవత్సరాల క్రితం ఓల్గా తీర మధ్య భాగంలో జరిగింది. తల్లుల ప్రాధాన్యత కలగిన సమూహాల సహజీవనంగా గుంపు జీవితం రూపొందింది. వేట క్షేత్రాల మీద ఆధిపత్యం కోసం గుంపుల మధ్య సంఘర్షణలు మొదలైనాయి. దివ సమూహం ఉష సమూహంతో అలాంటి యుద్ధాలే చేసింది. అడవిలో జంతు సమూహాలు నిలిచి వుండటానికి వీలుగా వాటి ఆహారపు అవసరాలను తీర్చడానికి గాను గడ్డి విత్తనాలను తేమ నేలలో చల్లి గడ్డి పెంచటం రూపంలో తొలి వ్యవసాయం ప్రారంభమైంది. గుంపు యుద్ధాలలో ప్రాణాలు కోల్పోయిన వారి సంబంధీకులు యుద్ధం యొక్క అమానవీయ లక్షణాన్ని గుర్తించటం కూడా ఈ దశలోనే కనబడుతుంది. యుద్ధం చేయటానికి తగిన శక్తి సామర్థ్యాలు చాలని వాళ్ళు ఓల్గా తీర ప్రాంతాలను వదిలి వలస పోవటం ప్రారంభమైంది.

మూడవ కథ 'అమృతాశ్వుడు'. క్రీ.పూ. మూడువేల సంవత్సరాల క్రితం మధ్య ఏషియా ప్రాంతాలలో కురు సమూహాల జీవితాన్ని చిత్రించింది. పశు సంపద పోగు పడి ఆ సంపదను హరించటానికి గుంపుల మధ్య దాడులు, దోపిడీలు సాధారణ మవుతున్న స్థితిలో స్త్రీలు కూడా పశువులతో పాటు హరించుకుపోయే వస్తువులయ్యారు. పశు సంపద మీద పురుషుడు యాజమాన్యాన్ని స్థిరీకరించుకొని స్త్రీని గృహపత్నిగా చేసిన చారిత్రక దుస్సంఘటన గురించి అమృతాశుడు వేదన పడతాడు. స్త్రీ పురుషులు స్వతంత్రులుగా, స్వచ్ఛందంగా కలిసి జీవించిన సామాజిక అవశేషాల గురించి కథలుగా చెప్పుకొంటున్నారు. ఆ సమాజాలలోని మంచిని నిలబెట్టుకొంటూ, తన ప్రేయసి మధురతో సమాన సహచర స్వభావం కలిగిన జీవితాన్ని జీవించాలని ఆకాంక్షిస్తాడు. పశు సంపద అపహరణలో భాగంగా ప్రతి పక్షపు గుంపు జనాన్ని అందరిని చంపటమే ఆ నాటి ధర్మం. స్త్రీలను మాత్రం పట్టి తీసుకు వచ్చి, తమ గుంపులోకి భార్యలుగా స్వీకరించటం జరిగింది. ఆ రకంగా బహు భార్యాత్వం మొదలైన దశలో ఈ కథ ముగుస్తుంది.

నాలుగవ కథ 'పురుహూత'. క్రీ.పూ. రెండువేల ఐదువందల సంవత్సరాల నాటి మధ్య సమాజాల జీవితాన్ని కేంద్రంగా చేసుకొని నడుస్తుంది. వ్యవసాయం, పశుపోషణ ఎంత ఎక్కువనే సాగుతున్నాయి. స్థిర నివాస గ్రామాల వల్ల, రాగి ఆయుధాల వల్ల పెరుగుతున్న స్వార్థం పట్ల, యుద్ధ క్రౌర్యం పట్ల పశు పోషణాభి మానుల వ్యతిరేకత ఇందులో కనబడుతుంది. వ్యవసాయ సమాజంలో అభివృద్ధి చెందిన వస్తు వినిమయ పద్ధతి వ్యాపారం, అందులోను ఆహార వస్త్రాదులను ఇచ్చి రాగి పాత్రలు, వెండి, బంగారు ఆభరణాలు కొనుక్కొనే పద్ధతి సమూహాన్ని ఆకలి చావుల వైపుకు తీసుకు వెళ్తుందన్న ఆందోళన మొదలైంది. మనుషులను బానిసలు చేసి అమ్మటం, కొనటం ఈ దశలోనే వచ్చింది. వ్యాపారంలో ఏకస్వామ్యాన్ని ప్రతిఘటించాల్సిన వాస్తవ జీవన పరిస్థితి నుండి కొన్ని సమూహాలు కలిసి ఉమ్మడి సేనాధిపతిని ఎన్నుకొని, అతని నాయకత్వంలో పనిచేయటం మొదలైంది.

అయిదవ కథ 'పురుధానుడు' క్రీ.పూ. రెండు వేల సంవత్సరాలనాటిది. స్థానిక వ్యవసాయ సమాజాలలో శ్రమ విభజన వల్ల అసమానతలు ఎక్కువ అవుతూ రాజు నియంతగా వ్యవహరించే పరిస్థితి వుంది ఈ అసురులతో స్నేహ సంబంధాల వల్ల ఆర్య స్త్రీలలో ఆభరణాల పట్ల, సింగారం పట్ల సరదా ఎక్కువ అవుతున్నా ఆయుధ విద్యను ఇంకా వదిలి వేయలేదు. స్త్రీలను దాసులుగా, భోగ వస్తువులుగా చేసుకొన్న అసుర సంస్కృతి వల్ల ఆర్య స్త్రీల అపహరణతో ప్రారంభమై ఆర్యులకూ అసురకు మధ్య యుద్ధాలు కొనసాగాయి.

ఆరవ కథ 'అంగిరా' తక్షశిలలో క్రీ.పూ. 1,800 సంవత్సరాల కాలంలో జరిగిన కథ ఇది ఇద్దరు మిత్రుల మధ్య సంభాషణా రూపంలో ఆర్య అసుర సమూహాల మధ్య వున్న తేడాలు విస్తృతంగా ప్రస్తావనకు వచ్చాయి. ఈ కథలో అసురులు ఆర్యుల కంటే వృత్తి నైపుణ్యం సంపాదించారు. లిపి సంప్రదాయాన్ని ఏర్పరచుకొన్నారు. నగర నిర్మాణ నైపుణ్యాన్ని పెంచుకొన్నారు. ప్రజల మీద రాజు సర్వాధికారి అయితే రాజుమీద దేవుడు సర్వాధికారి అన్న భావన అభివృద్ధి చెందింది. అయినప్పటికీ జాతి విభేదాలు, బానిస విధానం, పురోహిత ఆచార పద్ధతి. నియంతృత్వ రాచరికం ఈ వ్యవస్థలోని లోపాలుగా చూపించి అంగిరా రుషి అసురలలోని అభివృద్ధికర అంశాలను స్వీకరించి, మిగిలిన వాటిని త్యజించాలని తన సమూహాన్ని హెచ్చరిస్తాడు. ఆర్య అసుర సంగ్రామాల వల్ల క్రమంగా వాళ్ళిద్దరి మధ్యా క్రూరమైన శతృత్వ భావన తగ్గుతూ వచ్చి సామరస్య పూర్వకమైన సహజీవనం ప్రారంభమైంది.

ఏడవ కథ 'సుదాసుడు' క్రీ.పూ. 1,500 సంవత్సరాల కాలంలో కురు పాంచాల దేశంలో వైదిక ఆర్యుల మధ్య జరిగిన కథ సుదాసుడు. సమూహం

నుండి అధికారాన్ని స్వాయత్తం చేసుకొని సమూహం కంటే అధికుడుగా సమూహానికి అతీతంగా రాజు, రాజ్యం స్థిరపడిన దశ ఇందులో ప్రతిఫలించింది. రాజ్యపాలనను సమర్థిస్తూ ప్రజలను అదుపు చేసే పురోహిత వర్గం బలపడింది. ఈ నిరంకుశ భోగలాలస రాచరిక వ్యవస్థకు దివోదాసు ప్రతినిధి అయితే, అతని కొడుకు సుదాసు ఈ వ్యవస్థపై విమర్శకుడు. మనిషికి విలువలేని, స్త్రీకి స్వాతంత్ర్యంలేని రాచరిక వ్యవస్థ పట్ల విముఖుడు. అయినా దానిని తాను మార్చలేడు. దానిలో భాగం కాకా తప్పదు.

ఎనిమిదవ కథ 'ప్రవాహణుడు' క్రీ.పూ. 700 ప్రాంతాలలో పాంచాలంలో జరిగిన కథ. ఇంద్రుడు, వరుణుడు, బ్రహ్మ మొదలైన వేద దేవతల పట్ల, వాళ్ళ కోసం చేసే యజ్ఞాల పట్ల సందేహాలు తలెత్తుతున్న పరిస్థితులలో రాజ్యాన్ని నిలబెట్టే దోపిడీ పీడనలు యథాతథంగా కొనసాగటానికి కావలసిన తాత్త్విక భూమికను కల్పించటం కోసం ప్రవాహణుడు పునర్జన్మ సిద్ధాంతాన్ని బలంగా ముందుకు తీసుకు వచ్చాడు. ప్రవాహణుడి భార్య లోపా ఈ వాదానికి ప్రథమ విమర్శకురాలు. ప్రవాహణుడి మరణానంతరం కూడా జీవించిన లోపా అతను వదిలి వేసిన చిన్న నెరుసు లాంటి బ్రహ్మవాదం కార్చిచ్చు అయి కురు పాంచాలాన్నంతటినీ కాల్చి విదేహకు పాకటాన్ని చూస్తుంది. బ్రహ్మవాదిని అయిన గార్గి కూడా ఇది భోగ విలాసాలను సంపాదించటానికి ఒక సాధనమైందని గ్రహిస్తుంది. రాజవాదం, బ్రహ్మ వాదం, యుద్ధ వాదం అన్నీ ప్రజల కష్టార్జితాన్ని తేరగా అనుభవించే కపట నాటకపు పద్ధతులేనని వాళ్ళిద్దరూ అనుకొంటారు.

తొమ్మిదవ కథ 'బంధుల మల్ల'. క్రీ. పూ. 490 ప్రాంతాలది. అప్పటికి మగధ కోసల ప్రాంతాలు ఏర్పడ్డాయి మల్ల గణ సమూహాలను ఏకం చేసి వాళ్ళెవరికీ తేరి చూడటానికి వీల్లేకుండా చేయాలని బంధులమల్లు ఆకాంక్ష. అందుకోసమే అతను తక్షశిల వరకు వెళ్ళి అస్త్ర శస్త్ర విద్యలు నేర్చుకొని వచ్చాడు. కానీ మల్ల గణ సమూహాల ఈర్ష్యాసూయలకు గురి అయిన బంధులమల్లు తన నాయకత్వం, తన పరాక్రమం అవసరం లేదనుకొనే మల్ల సమూహాల మధ్య బ్రతకటం కంటే ఆ గణ సమూహాన్ని వదిలి వెళ్ళటం శ్రేయస్కరమని తన ప్రేయసి మల్లికతో సహా వెళ్ళి కోసల రాజు ప్రసేనజిత్తుడి కొలువులో సేనాపతిగా చేరతాడు. చిన్న చిన్న గణ రాజ్యాల అస్తిత్వం కష్టమై పోతుండగా గణ రాజ్యాలను కలిపి ఒక సంఘంగా వుంచే ప్రయత్నాలు దుస్సాధ్యమవుతున్న స్థితిని బంధులమల్లు కథ సూచిస్తుంది.

ఇటువంటి పరిస్థితులలో ఇంకా గణ రాజ్యాల స్వేచ్ఛా స్వాభిమాన జీవనం వదులుకోని నాగదత్తుడు గణ రాజ్యాలను బ్రతికించుకొనే విధానాలను అన్వేషించ

టానికి పర్షియన్ గ్రీకు రాజ్యాలవైపుకు ప్రయాణమైతే, చిన్న గణ రాజ్యాల యుగం అంతరించి పోయిందని, పెద్ద గణ రాజ్యాన్ని ఏర్పరచటం ఆచరణ సాధ్యం కాదని విశ్వసించే విష్ణుగుప్త చాణుక్యుడు అప్పటికే ఏర్పడ్డ మగధ రాజ్యానికి జంబూ ద్వీపాన్ని సమైక్య పరిచే లక్షణం ఏ మేరకు వుందో తెలుసుకోవటానికి తూర్పుదేశాలవైపుకు ప్రయాణమయి వెడతాడు. ఆ విధంగా పదవది అయిన 'నాగదత్తుడి' కథ క్రీ. పూ. మూడు వందల ముప్పై అయిదు ప్రాంతాలలో తక్షశిలలో ప్రారంభమవుతుంది.

పదకొండవ కథ 'ప్రభ' క్రీ. పూ 50 సంవత్సరాల నాటిది. గ్రీకు యువతి అయిన ప్రభకు అశ్వఘోష మహాకవికి మధ్య సాగిన ప్రణయ గాథ ఇది అశ్వఘోషుడు బ్రాహ్మడయినందువల్ల ప్రభను పెళ్ళి చేసుకోవటం కుదరలేదు. బ్రాహ్మణత్వాన్ని విమర్శనాత్మకంగా అర్థం చేసుకొనే క్రమంలో బౌద్ధానికి చేరువవుతాడు. ప్రభ మరణానంతరం బౌద్ధ సంఘంలో చేరి తన సాహిత్య తాత్విక కృషిని కొనసాగిస్తాడు.

పన్నెండవది అయిన 'సుపర్ణ' యౌధేయుడి కథ. క్రీ. శ 420 నాటిది. గుప్త సామ్రాజ్యం విస్తరించటంతో ఉనికిని కోల్పోయిన యౌధేయ గణ రాజ్యం నుండి వలస వచ్చిన యౌధేయ కుటుంబ వారసుడు సుపర్ణుడు. క్షత్రియులు బ్రాహ్మలు వేరు వేరుగా లేని గణ సంస్కృతి దశనుండి వచ్చిన యౌధేయుల ఉనికి బ్రాహ్మణ సంస్కృతి బలపడిన రాజ్యాలలో అవహేళనకు గురి అయింది. యౌధేయుల కుల గౌరవాన్ని నిలబెట్టటానికి సుపర్ణుడు భారతాది గ్రంథాలలో బ్రాహ్మణ క్షత్రియ వర్గ భేదం స్పష్టంగా రూపొందని దశలను సూచించే రంతిదేవుడి కథను ఉదాహరణగా ప్రస్తావిస్తాడు. కవిగా అప్పటికి కాళిదాసు సుప్రసిద్ధుడు. కానీ రాజు పట్ల దాస్య ప్రవృత్తిని ప్రదర్శించే అతని వైఖరిని యౌధేయుడు భరించలేకపోతాడు. రాజులు చేసే ప్రతీ పనిని ధర్మబద్ధమని పొగిడే సాహిత్య సృష్టిని, రాజ్యాన్ని బలపరచటంలో ఇంతకాలం వశిష్ఠ విశ్వామిత్రులు నిర్వహించిన పాత్రను ఇప్పుడు సాహిత్యకారులు నిర్వర్తించటాన్ని సుపర్ణుడు నిరసిస్తాడు.

పదమూడవ కథ 'దుర్ముఖుడు' క్రీ. శ 630 సంవత్సరాల నాటి వర్ణాశ్రమ ధర్మ పరిరక్షణ, మతతత్త్వం స్వభావంగా కలిగిన రాజ్యాల మీద విమర్శనాత్మక దృష్టిని ప్రసరింపచేస్తుంది. పదునాల్గవ కథ 'చక్రపాణి' క్రీ శ 1200 సంవత్సరాల నాటిది. రాజులు భోగలాలసులై వ్యర్థమయిన జీవితాన్ని గడుపుతూ హిందూరాజ్య పతనానికి కారకులై ముస్లిం రాజ్య నిర్మాణానికి దారి సుగమం చేయటాన్ని నిరూపిస్తుంది. పదిహేనవ కథ 'బాబా' నూర్‌దీన్. క్రీ. శ 1300 సంవత్సరాల నాటిది. ముస్లిములు భారతదేశంలో పాలకులుగా స్థిరపడుతూ ఇక్కడి ప్రజల సౌఖ్యం

కోసం పని చేయకపోతే తమకు ఉనికే వుండదని గ్రహించి, మతంతో సంబంధం లేని నీతిని రాజ్యపాలనకు ప్రాతిపదికగా చేసుకొని దిగువ వర్గాల వారిలో, ముఖ్యంగా రైతాంగంలో ముస్లిం పాలన పట్ల అనుకూల వైఖరిని, విశ్వాసాన్ని కలిగించ గలుగుతారు. సూఫీ మత వైఖరి హిందూమతం పట్ల సహనాన్ని అభివృద్ధి చేసే ప్రేమతత్వాన్ని ప్రచారం చేయటం, దీనికి మరింత అనుకూల వాతావరణాన్ని కలిగించ గలిగింది.

తరువాతి కథ 'సురైయా' క్రీ. శ. 1600 సంవత్సరాల నాటిది. అక్బర్ పాలనా కాలంలో హిందూ ముస్లిముల మధ్య సఖ్యతను కుదర్చటానికి జరిగిన ప్రయత్నాల ప్రస్తావన ఈ కథలో ప్రధానాంశం. ఎవరూ తమ మతం వదులుకో వలసిన అవసరం రాకుండానే హిందువులు ముస్లిములు వైవాహిక సంబంధాల నేర్పరచుకొని జీవిత భాగస్వాములై కొత్త ప్రపంచాన్ని సృష్టించాలన్న అక్బర్ తదితరుల ఆలోచనలకు ఆచరణ రూపంగా తోడర్‌మల్లు కొడుకు కమల్' అబుల్ ఫజల్ కూతురు సురైయా ప్రేమించుకొని పెద్దల ఆమోదంతో పెళ్లాడతారు. ఇద్దరూ వెనీసు నగర యాత్రకు వెళ్ళి భారతదేశాన్ని అలాంటి సమ ఆర్థిక వ్యవస్థ కల సుసంపన్న రాజ్యంగా అభివృద్ధి చేయటానికి సముద్రంమీద ఆధిపత్యం సంపా దించటం ముఖ్యమన్న అవగాహనను పెంచుకొంటారు. తమ నూతన ప్రాపంచిక దృక్పథాన్ని భారతదేశంలోకి తీసుకురాకుండానే వాళ్ళు తిరుగు ప్రయాణంలో సము ద్రపు దొంగల దాడికి గురి అయి మరణిస్తారు.

పదిహేడవ కథ 'రేఖాభగత్' క్రీ. శ 1800 సంవత్సరాల నాటిది. బ్రిటిషు వాళ్ళు సముద్రంమీద ఆధిపత్యం సంపాదించిన తరువాత తూర్పు ఇండియా కంపెనీ పాలనలో భారతదేశంలో వచ్చిన పరిణామాలను చిత్రించింది. గ్రామ పంచాయితీల పాలనలో స్వయంపోషక ఆర్థిక వ్యవస్థ వుండగా ఈస్టిండియా కంపెనీ అమలు పరచిన భూమిశిస్తు విధానం వల్ల భూస్వామ్య ఆర్థిక వ్యవస్థ జమీం దారీ విధానం రూపంలో బలంగా స్థిరపడింది. జమీందారు మొదలుకొని కరణం గుమస్తా వరకు అందరూ రైతును పీడించే నిర్మితిలో భాగమయ్యారు. తూర్పు ఇండియా కంపెనీ అవలంబించిన ఆర్థికవిధానం వల్ల చేతి వృత్తులు నశించి ప్రత్యా మ్నాయ ఉపాధి అవకాశాలు లేని గ్రామీణ జనం నిరుపేదలుగా మారారు. కరువు పరిస్థితులు వీళ్ళ జీవితాన్ని మరింత దుర్భరం చేశాయి. ఈ పరిస్థితుల నుండి రేఖా భగత్ లాంటి తిరుగుబాటుదార్లు పుట్టుకు వస్తున్నారు.

'మంగళ సింహుడు' 1857 నాటి కథ. తూర్పు ఇండియా కంపెనీ అవలంబిం చిన రాజకీయార్థిక విధానం వల్ల అధికారాన్ని కోల్పోయిన స్థానిక రాజవంశస్తుడు మంగళ సింహుడు. తండ్రి హయాములో పోగొట్టుకొన్న ఈ పాలనాధికారాన్ని

గాడకు తిరిగి సంపాదించుకోవాలన్న ఆశతో తల్లి అతన్ని పెంచుకొచ్చింది. ఇంగ్లీషు చదువుల వల్ల కంపెనీ పాలనా వల్ల భారతదేశం సాంస్కృతికంగా వైజ్ఞానికంగా ఆధునికం కావటం చూసి ఆనందిస్తాడు. పై చదువులకోసం ఇంగ్లండుకు వెళ్ళి ప్రపంచ విజ్ఞానంతో సంబంధం ఏర్పరచుకొంటాడు. అక్కడ అతనికి మార్క్స్, ఎంగెల్సుతో పరిచయం కూడా ఏర్పడుతుంది. దానితో అతను తన స్వంత సంస్థానాన్ని విముక్తం చేసుకొనే ఆలోచన దగ్గర ఆగిపోకుండా మొత్తం భారతదేశ విముక్తిని కాంక్షించే స్థాయికి ఎదుగుతాడు.

పంతొమ్మిదవ కథ 'సఫదర్' 922 కాలంలో సంభవించిన భారత రాజకీయ పరిణామాలను సూచిస్తుంది. జాతీయోద్యమ నిర్మాణంలో గాంధీజీ పాత్రను గుర్తిస్తూనే ఆయనను విమర్శనాత్మకంగా అర్థం చేసుకొనే క్రమంలో ఉద్యమ దిశను నిర్ణయించేది ప్రజలని, గాంధీ చెప్పినట్లు అహింసాయుతమైన సహాయ నిరాకరణోద్యమం వల్ల ఏ ఏడాది కాలంలోనో వొరిగేది రాదు స్వరాజ్యం అన్న అవగాహనతో సఫదర్, శంకర్‌లాంటి యువకులు, వాళ్ళ భార్యలు హిందూ ముస్లిములు, స్త్రీ పురుషులు అనే భేదాలు లేకుండా దీర్ఘకాలిక పోరాటాలకు సంసిద్ధులు కావటం ఈ కథలో విషయాలు.

చివరి కథ 'సుమేరుడు' మాదిగ కులస్థుడైన సుమేరుడు గాంధీ రాజకీయాలు, ఆయన ప్రచారంలోకి తెచ్చిన 'దైవ భావన' తమకెంతో ద్రోహం చేశాయని అభిప్రాయ పడతాడు. తమను హిందువుల నుండి వేరైపోకుండా చూడాలని తమకు గాంధీ హరిజనులని పేరు పెట్టటాన్ని అసహ్యించుకొంటాడు. అంబేద్కర్ పద్ధతి కూడా అస్పృశ్యతా నివారణకి పూనుకొన్న కాంగ్రెసు నాయకుల పద్ధతికి భిన్నమైంది కాదని ప్రకటిస్తాడు. దోపిడి పోవటం తప్ప తమ సమస్యకు పరిష్కారమే లేదంటాడు. అంతర్జాతీయ ఫాసిస్టు శక్తుల నుండి దాడికో భాగస్వామి అయిన సామ్యవాదాన్ని తొందరగా ఆపదలోంచి తీసుకురావాలని రెండవ ప్రపంచ యుద్ధంలోకి దూకుతాడు.

ఈ ఇరవై కథలను ఈ విధంగా వ్రాయటంద్వారా రాహుల్ సాంకృత్యాయన్ ప్రధానంగా ఉత్పత్తి శక్తుల అభివృద్ధిని, దానితోపాటు మారుతున్న ఉత్పత్తి, సంబంధాలను, వాటికనుగుణంగా రాజ్యం ఏర్పడి స్థిరపడటాన్ని, అందులో భాగంగా కుటుంబం ఏర్పడి, స్త్రీ పురుష సంబంధాలను నిర్దేశించటాన్ని నిరూపించదలచుకొన్నాడు.

ఆహార సేకరణ దశలో మానవ సమూహాల జీవితాన్ని పరిచయం చేయటంలో ప్రారంభమైన 'ఓల్గా నుంచి గంగకు' పుస్తకంలో ప్రాథమిక ఉత్పత్తి సాధనాలుగా విల్లు, బల్లెము కనబడతాయి. విల్లు మానవ నాగరికతలో ప్రధానమైన ఆవిష్కరణ. అటువంటి విల్లును కనుక్కొనే వరకు మానవుడు సాగించిన ప్రస్థానం

సుదీర్ఘమైంది. మానవుడు జంతువు నుంచి వేరుపడి ప్రత్యేకతను సంతరించుకొని 2 మిలియన్ల సంవత్సరాలయితే అందులో 1.9 మిలియన్ల సంవత్సరాల కాలం ఆదిమ సమాజ దశ. అందులో మొట్టమొదట వచ్చిన అభివృద్ధి వేటాడటం. ఈ అభివృద్ధికి మూలమైన ఉత్పత్తి సాధనాలు విల్లు, బల్లెం. అవసరమైనపుడు ఆహారం లభించకపోవటం, అవసరం లేనప్పుడు ఆహారం సమృద్ధిగా దొరికినా అది ఉపయోగంలోకి రాకపోవటం, జంతు సంపద నశించిపోవటం, ప్రాణాలకు తెగించి ప్రతిసారీ జంతువులను వేటాడాల్సి రావటం - వేటాడే క్రమంలో అనుభవంలోకి వచ్చిన ప్రధాన సమస్యలు. వీటిని పరిష్కరించుకోవాలన్న ఆలోచన నుండి పశువులను మచ్చిక చేసుకోవటం అలవాటయింది. ఇది పశు సంపద అభివృద్ధికి దారితీసింది. క్రమంగా సంపద హరణానికి కూడా చోటిచ్చింది. ఒక గుంపుకు చెందిన పశువులను ఇంకొక గుంపువాళ్ళు అపహరించుకు పోవటం, వాటికోసం యుద్ధాలు చేయాల్సి రావటం 'అమృతాశ్వుడి కథ'లో నిరూపించబడింది. ఉత్తర గోగ్రహణం, దక్షిణ గోగ్రహణం వంటి కథాంశాలు మహాభారతంలో చోటు చేసుకోవటం ఈ ప్రాచీన సమాజ లక్షణం యొక్క చారిత్రక అవశేషాలుగానే అర్థం చేసుకోవాలి.

పశు పోషక గణాలు ఓల్గా తీర ప్రాంతాల నుండి సంచారం చేస్తూ భారత దేశంలోకి వచ్చేటప్పటికి ఇక్కడ కొద్దిగానో గొప్పగానో వ్యవసాయం తెలిసి స్థిర జీవితం ఏర్పరచుకొని జీవిస్తున్న జాతులున్నాయి. ఈ జాతుల జీవిత విధానం గురించి పశు పోషక సమాజాల వాళ్ళమధ్య జరిగిన సంభాషణల ద్వారా తెలుస్తుందే తప్ప ప్రత్యేకించి వాళ్ళ గురించిన కథలు ఈ పుస్తకంలోలేవు. సింధు నాగరికతను ఆర్యులు రాకముందరి వ్యవసాయ నాగరికతా రూపంగా కోశాంబి వంటి చరిత్రకారులు చెబుతున్నారు. ఈ నాగరికతకు సంబంధించిన అవగాహన కలగటానికి వీలుగా ఒక కథైనా 'ఓల్గా నుంచి గంగకు' లో ఉండి వుంటే ఇది మరింత సమగ్రంగా ఉండేది.

లోహం వాడుకలోకి రావటం ఉత్పత్తి సాధనాలలో మరింత అభివృద్ధిని తీసుకు వచ్చింది. రాగి పనిముట్లు వాడే దశ నుండి ఇనుమును కరిగించి సాధనాలు తయారు చేసుకొనే దశకు ఎదిగిన కొద్దీ వ్యవసాయ నాగరికత స్థిరపడుతూవచ్చింది. వ్యవసాయ జీవితంలో స్థిరత్వం ఉంది. సంపదను తరతరాలకు వారసత్వంగా అందించే లక్షణమూ ఉంది. ఈ రెండూ కూడా పశుపోషక సమాజాల చేత తీవ్రంగా గర్హించబడ్డాయి వ్యవసాయ సమాజాలలో ఉత్పత్తులు పెరిగే క్రమంలో- నూలు నుండి వస్త్రం తయారు చేసుకోవటం వంటి ఆవిష్కరణలు జరిగాయి. లోహాలను కరిగించి పనిముట్లను తయారు చేసుకొనే క్రమంలో చేతి వృత్తుల నైపుణ్యం అవసరమైంది. వ్యవసాయోత్పత్తులను నిలవ చేసుకోవటానికి సూటిన వస్తూత్పత్తుల

గురించి అన్వేషించాల్సి వచ్చింది. ఇవన్నీ కలిసి శ్రమ విభజనను విస్తృతం చేయటమే కాక వస్తూత్పత్తులలో గణనీయమైన అభివృద్ధిని తీసుకు వచ్చింది. దానితో వినిమయమూ అధికమై అది వస్తు మార్పిడి పద్ధతిని ఒక మార్కెటు వ్యవస్థగా ముందుకు తీసుకు వచ్చింది. ఇట్లాంటి వ్యవస్థలలో మిగులు విలువను మరింత ఎక్కువ చేయటానికి ప్రధానమైన ఉత్పత్తి సాధనం మానవ శ్రమే కనుక కొంత మందిని బానిసలు చేసే క్రమం మొదలయింది. ఈ పరిణామాలను పశు పోషక సమాజాలు జీర్ణం చేసుకోలేక పోయాయి. వ్యవసాయ వర్గ సమాజాన్ని విమర్శించి వ్యతిరేకించాయి. ఈ సామాజిక సంఘర్షణను 'పురుహూతుడు' అనే కథలో నిరూపించాడు రాహుల్ సాంకృత్యాయన్.

అయితే ఈ సంఘర్షణ ఎక్కువ కాలమేమీ కొనసాగలేదు. పశుపోషక గణాలు స్థానిక వ్యవసాయవర్గ సమాజాలను ఓడించి వాళ్ళ మీద తమ ఆధిపత్యాన్ని స్థాపించుకొనే క్రమంలో తమ జీవిత విధానాన్ని కూడా వ్యవసాయ వర్గ సమాజానికి అనుగుణంగా మలుచుకొన్నారు. ఆ రకంగా ఆర్య అనార్య జాతుల మధ్య సహ జీవనం ఒక చారిత్రక అనివార్యత అయింది. ఈ క్రమం 'అంగీరా' కథలో నిరూపించబడింది. వ్యవసాయం విస్తరించటం, చేతి వృత్తుల నైపుణ్యం అభివృద్ధి చెందటం, స్వయం పోషక గ్రామీణ వ్యవస్థ నిర్మాణానికి దారి తీసింది. క్రీ. పూ. మూడు నాలుగు శతాబ్దాల నాటికి ఏర్పడిన ఈ వ్యవస్థ ఐరోపా ఖండాల వాళ్ళు వ్యాపారం కోసం భారతదేశంలో ప్రవేశించేనాటి వరకు కొనసాగింది. బ్రిటిష్ వాళ్ళ అధికారం స్థిరపడిన తరువాత వారవలంబించిన 'భూ విధానం' స్వయం పోషక గ్రామీణ ఆర్థిక వ్యవస్థను విచ్ఛిన్నం చేసింది. దీని వలన గ్రామాలలోని జడత్వం కదలబారినా, నూతనంగా సృష్టించబడ్డ జమిందారీ వర్గం వల్ల రైతాంగం పీడనకు దోపిడికి గురి కావటం, భూమికి పరాయివాళ్ళు కావటం జరిగింది. ఈ పరిస్థితిని 'రేఖా భగత్' కథలో వివరించటం జరిగింది.

ఈ ఆర్థికాభివృద్ధి క్రమమే రాజ్యం పుట్టుకకు దారి తీసింది. వేటాడే దశలో ఉత్పత్తి సాధనాలు పరిమితమైనవే. మిగులు ఉత్పత్తి అసలే లేదు. అందువల్ల ఆనాడు రాజ్యం లేదు. మానవ సమూహానికంతటికి భౌతిక మూలంగా కనిపించే తల్లే సమూహానికి నాయకురాలు. ఆహార సేకరణ, పంపిణీ ఆమె నేతృత్వంలో జరిగాయి. గుంపు పరిణామం పెరిగే కొద్దీ గుంపు అవసరాలు ఎక్కువైనాయి. వాటిని తీర్చటం కోసం వేట క్షేత్రాల మీద ఆధిపత్యం సంపాదించుకోవటానికి గుంపుల మధ్య యుద్ధాలు సంభవించాయి. ఈ యుద్ధాలను నిర్వహించింది, గుంపు నాయకురాలైన తల్లే. తల్లి నాయకత్వాన్ని రాజ్యం యొక్క ప్రాథమిక దశగా అనుకొంటే ఈ దశకు 'నిశ', 'దివ' అన్న మొదటి రెండు కథలు ప్రాతినిధ్యం వహిస్తాయి.

పశు సంపద పెరిగే కొద్దీ వాటిని మేపుతు వస్తున్న పురుషుడి స్వంత సంపదగా అది ఏర్పడటం మొదలైంది. దాని పరిణామ ఫలితంగా పశు పోషక సమూహాలలో సమూహం మీద ఆధిపత్యం పురుషుడిదయింది. పశు సంపదను పెంచుకోవటం, కాపాడుకోవటం అనే లక్ష్యాలతో గుంపుల మధ్య యుద్ధాలు సాగుతూనే వున్నాయి. ఈ యుద్ధాలలో గెలుపును సాధించిన వ్యక్తి మహా పితరుడుగా కొన్ని కుటుంబాలను, వాళ్ళ పశు సంపత్తిని నిర్వహించటానికి, కాపాడటానికి బాధ్యత వహిస్తాడు. అ విధంగా మహా పితరుడి రూపంలో రాజ్యం యొక్క ప్రాథమిక రూపం ఏర్పడింది. తల్లి నాయకత్వంలోని రాజ్యంలో రక్త సంబంధీకులైన వాళ్ళ గుంపు మీద సహజంగా వచ్చిన పెత్తనం వుంటుండగా మహాపితరుని రాజ్యంలో వేరు వేరు కుటుంబాల వాళ్ళు తమ భద్రతా అవసరాల దృష్ట్యా ఒక సామాజిక ఒప్పందంతో తమలో బలవంతుడైన వాణ్ణి, యుద్ధాలు నిర్వహించ గలిగిన వాణ్ణి మహాపితరుడినిగా ఎన్నుకోవటం జరుగుతుంది. ఆ రకంగా అధికారం పై నుంచి అపాదించబడే రాజ్యం యొక్క నిర్మాణానికి ప్రారంభ బీజాలు ఇక్కడే పడ్డాయి అయితే స్థానిక వ్యవసాయవర్గ సమూహాలలో ప్రజాధికారాలన్నీ స్వచ్ఛందంగానో, బలవంతంగానో దత్తత చేయబడిన సర్వాధికారిగా 'రాజు' ఉనికిలోకి వచ్చాడు. ఆర్యుల సేనా నాయకుడైన మహాపితరుడికి, అసురుల రాజుకు మధ్యవున్న ఈ తేడాను 'అంగీరా' 'సుదాసుడు' మొదలైన కథలలో ప్రస్తావించటం జరిగింది. ఆర్యులు అసురులను జయిస్తూ వారితో సహజీవనంలోకి వచ్చేసరికి అధికారాలన్నీ పై నుంచి దత్తత చేయబడ్డ రాజునే సర్వాధికారిగా స్థిరీకరిస్తూ రాజ్యం తన సమగ్ర రూపాన్ని తీసుకొంది. మగధ రాజ్యం ఇందుకు ఒక నమూనా.

భారతదేశం మొత్తంమీద ఇలాంటి రాజ్యం ఒకేసారి రూపొందలేదు. ఎన్నో గణరాజ్యాలు తమ స్వతంత్ర ప్రతిపత్తిని నిలబెట్టుకోవటానికి ప్రయత్నిస్తుండటం, పక్కపక్కనే ఏర్పడుతున్న రాజ్యాల స్వభావాన్ని చూసి ఆశ్చర్యపోవటం, ఆందోళన పడటం జరిగింది. మగధ, కోసల, వైశాలి లాంటి రాజ్యాలను ఎదుర్కోవటానికి కొన్ని గణాలు ఒక సమూహంగా ఏర్పడటం, సామూహిక నాయకత్వాన్ని అంగీకరించటం ఒక చారిత్రక అనివార్యత అయింది. అయితే అధికారంకోసం, ప్రాకులాటలు, ఈర్ష్యలు, స్పర్ధలు గణ జీవితంలో ఈ సామూహిక సహజీవనాన్ని కొనసాగనివ్వలేదు. దానితో గణ జీవితం విచ్ఛిన్నం కావటానికి ప్రారంభం జరిగింది బంధుల మల్లు కథ ఈ విషయాన్నే చెబుతుంది. ఈ పరిస్థితులలో ఇంకా స్వతంత్ర ప్రవృత్తి కలిగిన గణరాజ్యాలమీద ఆశ వదలని నాగదత్తుడి లాంటి వైపు వుండగా, గణరాజ్యాలకు కాలం చెల్లిందని కాబట్టి, గణరాజ్యాలను వాళ్ళు ఒక [illegible] తీసుకు రావాలని ప్రయత్నించిన చాణుక్యుడి లాంటి వాళ్ళు

వున్నాయి. ఉపరితల పోరాట ప్రయత్నాలే ఫలించి, గణ రాజ్యాలను తుడిచిపెట్టి రాజ్యం ఒక శక్తిగా ఆవిర్భవించింది. గణ రాజ్యాలకు లేని ప్రాదేశిక పరిమితి, వారసత్వ క్రమం ఈ రాజ్యానికి ముఖ్య లక్షణాలయినాయి. రోజురోజుకు పెరుగుతున్న సంపదను కొద్దిమంది చేతిలో పోగుచేసుకోవటానికి, భోగాలను అనుభవించటానికి కావలసిన అవకాశాలను కల్పించటమే రాజ్య స్వభావం అయింది. రాజ్యం యొక్క ఈ స్వభావానికి ప్రాతినిధ్యం వహిస్తాడు ప్రవాహణుడు.

ఈ ఆర్థిక రాజకీయ పరిణామాలలో భాగంగానే పితృస్వామిక కుటుంబం ఏర్పడింది. పశు పోషక సమాజ అవసరాల నుండి ఏర్పడిందిది. పశుపోషణ సంచార జీవితంతో ముడిపడి వుండటం వల్ల స్త్రీలు పునరుత్పత్తి విధుల కారణంగా ఎల్లప్పుడూ సంచార జీవితం జీవించటానికి వీలుండదు. కనుక వాళ్ళు కొద్ది కాలమైనా ఒకచోట స్థిరంగా ఉండటం, పశుపోషణ కోసం గడ్డి విత్తనాలు వేసి పచ్చికను పెంచుకొన్న అనుభవం నుండి మానవ సమూహాల కోసం అవసరమైన ఆహార ధాన్యాల ఉత్పత్తికి వ్యవసాయాన్ని ఒక విధానంగా అభివృద్ధి చేసుకోవటం జరిగింది. పశుసంపద పెరిగే కొద్దీ ఆ సంపద మీద పురుషుడి ఆధిపత్యం స్థిరపడుతూ రాగా స్త్రీల స్థిర జీవనావసరాల కారణంగా సహజ శ్రమ విభజనలో భాగంగా పిల్లలను సవరించటం, కుటుంబావసరాలను నిర్వహించటం, అందులో భాగంగానే వ్యవసాయాన్ని సాగించటం స్త్రీల పని అయింది. లోహాన్ని కరిగించి నాగలిని వ్యవసాయోత్పత్తి సాధనంగా ఆవిష్కరించుకోవటంతో వ్యవసాయం చిన్న మళ్ళ నుండి పెద్ద వ్యవసాయ క్షేత్రాలకు విస్తరించింది. ఈ క్రమంలో వ్యవసాయ కార్యకలాపాలను నిర్వహించటం పురుషులు తమ పనిగా చేసుకొన్నారు. సామాజిక వ్యవసాయోత్పత్తి కార్యక్రమంతో సంబంధం లేని జీవితం స్త్రీలదయింది. పిల్లలను పెంచటం, ఇంటి పనిని చక్కబెట్టటమే స్త్రీల పనులయినాయి. ఆ విధంగా పితృస్వామిక వ్యక్తి కుటుంబం స్థిర రూపాన్ని తీసుకొనే క్రమం పూర్తయ్యేసరికి స్త్రీ పురుషుల మధ్య అంతులేని అసమానతలు ఏర్పడ్డాయి. ఈ సామాజిక పరిణామ క్రమాన్ని 'ఓల్గా నుంచి గంగకు' పుస్తకంలోని మొదటి రెండు మూడు కథలు సూచకప్రాయంగా తెలియచేస్తాయి.

మొదటి రెండు కథలు మాతృస్వామ్య కుటుంబ సంబంధాలను చిత్రిస్తే మూడవ కథ దగ్గరకు వచ్చేసరికి స్త్రీ పురుషులిద్దరూ సమానంకాని దశ, స్త్రీలు ఇంటి పనులకే పరిమితమైన దశ అస్పృశ్యాన్ని అంతరంగ వేదనా రూపంలో కనబడతాయి

మాతృస్వామిక కుటుంబాలలో రక్త బంధువులయిన స్త్రీ పురుషుల మధ్య స్వేచ్ఛాయుత సంబంధాలు ఉండి, అందులో భాగంగా స్త్రీ పురుషులు రాత్రికాలిరంగా జంట సంబంధాలలోకి రావటం జరిగేది. నిశ, దివ కథలలో ఈ దశనే కనబడ

తాయి. పశు సంపద మీద ఆధిపత్యం కోసం పెరుగుతున్న రక్త బంధీకుల గుంపుల మధ్య సంఘర్షణలు పెరుగుతున్నకొద్దీ సంపద హరణంలో భాగంగా స్త్రీలను కూడా అపహరించి తెచ్చుకోవటం, అట్లా తెచ్చుకొన్న స్త్రీలను భార్యలుగా చేసుకోవటం జరిగింది. పశుసంపద పెరిగినకొద్దీ కొంత స్థిరత్వం ప్రాతిపదికగా గల 'జంట పెళ్ళి' ఆమోద యోగ్యమవుతూ భార్యాభర్త వారి సంతానంతో, పశుసంపదతో కూడిన కుటుంబం అప్పటికి ఒక రూపం తీసుకొంటున్నది. గుంపు యుద్ధాలలో పశు సంపదతో పాటు తీసుకొచ్చిన స్త్రీలను కూడా భార్యలుగా చేసుకోవటం వల్ల, బహు భార్యాత్వం కుటుంబ వ్యవస్థలోకి ప్రవేశించింది. ఈ అన్ని పరిణామాలు 'అమృతాశ్వుడు' కథలోనే కనిపిస్తాయి.

మలి దశకు చెందిన వ్యావసాయిక సమాజాలలో స్త్రీ అప్పటికే ఇంటి పనికి పరిమితమై పోయింది. మనిషిని అమ్మటం, కొనటం అనే బానిస వ్యవస్థ ఏర్పడిన క్రమంలో స్త్రీ శరీరం కూడా పురుషుడి భోగానికి అమ్మకపు వస్తువైంది. కుటుంబం బయట వేశ్యా వ్యవస్థ తయారైంది. పురుధానుడు కథలో ఇది అసుర సంస్కృతిగా చెప్పబడింది

ఈ సంస్కృతిలో ఒక్కొక్క పురుషుడికి ఎంతోమంది భార్యలు మాత్రమే కాకుండా అనుభవానికి కావలసిన స్త్రీలు కూడా వుండేవారు. అటువంటప్పుడు ప్రత్యేకించి వాళ్ళు ఏ ఒక స్త్రీనో ప్రేమించి, అభిమానించే పరిస్థితి వుండదు. అటువంటప్పుడు ఆస్తికో, రాజ్యానికో వారసులయ్యే అవకాశమున్న మగపిల్లల తల్లులు మాత్రమే మిగిలిన స్త్రీల మధ్య కొంత మెరుగైన పరిస్థితిలో వుంటారు. కుటుంబంలో స్త్రీలకు ఏమైనా గౌరవ మర్యాదలంటూ దక్కితే అది మగపిల్లల తల్లులు కావటం వల్లనే- ఈ బాధాకర సామాజిక పరిస్థితి సుదాసుడి తల్లి అనుభవించిన వైనం 'సుదాసుడు' కథలో చూస్తాం.

రాజ్యం బాగా స్థిరపడిన తరువాత రాజు ప్రాపకాన్ని సంపాదించటంకోసం వివిధ స్థాయిలలో వుండే సామంతులు, అధికారులు, ఉద్యోగులు తమ ఆడపిల్లలను రాజాంతఃపురానికి పంపించేవారు. వారి వారి హోదాలనుబట్టి వాళ్ళల్లో కొందరికి రాణీహోదా లభిస్తే, మిగిలినవాళ్ళు పరిచారికలుగా మిగిలిపోయే వాళ్ళు. రాజు మరణిస్తే, రాజాంతఃపురంలోని ఈ వందలాది స్త్రీలు సహగమనం పేరుతో అగ్నికి ఆహుతి కావలసి వచ్చేది. ఈ విధంగా క్రీ. శ. 630 నాటికి స్త్రీలమీద కుటుంబ హింస పెరిగిపోవటాన్ని దుర్ముఖుడి కథ సూచిస్తుంది.

మధ్యయుగాల నాటికి భోగలాలస జీవితమే రాచరిక వ్యవస్థ లక్షణంగా మారి, సమాజం పతన దశకు చేరుకోవటాన్ని చక్రపాణి కథ వివరించింది. ఒక పురుషుడికి ఒక స్త్రీ అన్న భావమే అభావమై పురుషుల జీవితాలు అనేకమంది స్త్రీల కోటి ముడిపడి వుండటం పట్ల వ్యతిరేకతను సుదైయీ కథ వ్యక్తం చేస్తుంది.

ఎంత పెద్ద చక్రవర్తులైనా సరే ఒక స్త్రీని తప్ప ఎక్కువమందిని పెళ్ళాడటానికి వీలులేదన్న పద్ధతిని గురించి ప్రస్తావిస్తూ అక్బరు తనకా పద్ధతి ఎంతో నచ్చిందంటాడు. అనేకమంది స్త్రీలతో సంబంధాలు ఏర్పరచుకొనే వ్యవస్థలో పురుషుడు నిజమైన ప్రేమకు ఆత్మీయతకు దూరం అవుతున్నాడని ఆందోళన పడతాడు. ఆ సందర్భంగా అతను ఒక వేట అనుభవాన్ని గురించి చెబుతాడు. 'వేటలో మగ సింహాన్ని చంపేస్తే పొదలో నుండి ఒక్క ఉదుటున అక్కడికి వచ్చిన ఆడ సింహం తనవైపు అసహ్యంగా చూసి ముఖం తిప్పుకొని ఆ తరువాత గాయపడ్డ సింహం ముఖం నాకటం మొదలు పెట్టింద'ని చెబుతూ సింహానికి కూడా పదిహేడు వందల ఆడ సింహాలున్నట్లయితే అవి సింహం ముఖాన్ని నాకటానికి అలా వచ్చి వుండేవా అని తనకు అనిపించిందని అక్బరు అంటాడు. మనుష్యులు మానవీయత నుండి దూరమై జంతు సంబంధాలల్లో మానవీయతను వెతుక్కొనే విషాద పరిస్థితుల్లో ఒంటరితనాన్ని గురించిన వేదనను రాహుల్ సాంకృత్యాయనే అక్బరు ముఖంగా వ్యక్తం చేశాడు.

స్త్రీ పురుషుడి సంపదలో భాగమైనప్పటి నుండి, పితృస్వామిక కుటుంబ వ్యవస్థ ఏర్పడినప్పటి నుంచి, అసమ సంబంధాల వల్ల, బహు భార్యాత్వం వల్ల, సంతానం ద్వారా తప్పితే గుర్తింపబడలేని పరిస్థితులవల్ల, సతీ సహగమన పద్ధతుల వల్ల, దుర్భరమైన వితంతు జీవితంవల్ల కుటుంబ హింసకు గురి అవుతూనే వుంది. అసమ వ్యవస్థా స్వభావాన్ని పరిపోషిస్తూ నిలబెట్టే రాజ్యాంగ వ్యవస్థలో కుటుంబం కూడా భాగమే కావటం వల్ల, రాజ్యహింస కుటుంబ హింసకు తోడయి స్త్రీ జీవితాన్ని మరింతదుర్భరం చేస్తుంది. రేఖా భగత్ కథలో అలాంటి పరిస్థితి చిత్రితమైంది. కరువు కాలంలో తన ఇంట్లో కాసిన అనప పిందెలను తెంపుకు పోవటానికి వచ్చిన కరణం మనిషి ప్రయత్నాన్ని ప్రతిఘటించి రేఖా భగత్ కరణం ఆగ్రహానికి గురి అవుతాడు. కరణం అధికార వ్యవస్థలో భాగస్వామి కనుక రేఖా భగత్ మీద ప్రత్యక్ష చర్యకు దిగకుండా పై అధికారి ఊళ్ళోకి వచ్చినప్పుడు రెండు శేర్ల పాలు తెచ్చి కానుకగా యిమ్మని అతన్ని యిబ్బందిలో పెడతాడు. తన యింట్లో పాడి లేదు కనుక పాలు పంపించ లేనని రేఖా అంటాడు. అధికారి అందుకు మండిపడి 'ఆ ముండా కొడుకు పెళ్ళాం చన్నులు పిదికి పాలు తీసుకు రండి' అని తన మనుషులను ఆజ్ఞాపిస్తాడు. వాళ్ళు దానిని అక్షరాల అమలుచేస్తారు. తమ అధికారం మీద తిరుగుబాటు చేసిన రేఖాను శిక్షించటానికి కరణం అతనిపై అధికారి రేఖా భార్యను ఘోరంగా అవమానించటం ఒక మార్గంగా చేసుకొన్నారు. అధికార వ్యవస్థ మొత్తం పై నుండి క్రిందికి తన హింసా హస్తాన్ని కుటుంబంలోని స్త్రీ మీదకు సైతం చాచటాన్ని 'రేఖా భగత్' కథ చూపిస్తున్నది. సమకాలీన ప్రజా

ఉద్యమ చరిత్రలో ప్రమస్వాధికారం మీద తిరుగుబాటు చేసిన ఉద్యమకారుల మీద, వాళ్ళ స్త్రీలను అవమానపరచటం ద్వారా ప్రతీకారం తీర్చుకొనే పద్ధతి విస్తృతంగా కనిపిస్తుంది.

మాతృస్వామ్య వ్యవస్థ నుండి స్త్రీల జీవితాన్ని మొత్తం మానవ సమాజ పరిణామంలో భాగంగా చిత్రిస్తూ క్రమంగా స్త్రీ తన స్వాతంత్ర్యాన్ని, స్వేచ్ఛను, సామాజిక భాగస్వామ్యాన్ని కోల్పోతూ కుటుంబ పరిధిలో ఇరుకైన జీవితంలో మగ్గిపోవలసి రావటాన్ని, పితృస్వామిక కుటుంబాధికారం కింద మానవ వ్యక్తిగా బ్రతికే పరిస్థితిని కోల్పోవటాన్ని గురించిన చారిత్రక అవగాహనను అందించిన రాహుల్ సాంకృత్యాయన్, కోల్పోయిన జీవితాన్ని తిరిగి సాధించుకోవటానికిపీలుగా మహిళలకు ఉద్యమాలు నిర్మించుకొనే స్ఫూర్తినిచ్చాడు. స్త్రీలు తమ హక్కులను, స్వాతంత్ర్యాన్ని, స్వేచ్ఛను కోల్పోయినక్రమంలో చాలా సంఘర్షణకు లోనయినారు. 'అమృతాశ్వుడు' కథలోని మధుర, 'సుదాసుడు' కథలోని అపాల ఆ విధమైన ఘర్షణకు లోనైన వారే. లోపా, ప్రభలాంటి స్త్రీలు సమాజాన్ని గురించి, జీవితాన్ని గురించి ఆలోచిస్తూ తమ పురుషుల ప్రవర్తనకు ప్రథమ విమర్శకులై వాళ్ళ జీవిత దృక్పథాలను తీర్చి దిద్దటంలో ప్రముఖ పాత్రను వహించారు. రాజ్య హింసకు గురి అయి అవమాన పడిన 'మంగరీ' లాంటి స్త్రీలు తమ గౌరవం కోసం అవమానాలకు ప్రతీకారం తీర్చటం కోసం, బాధలను అణుచుకొని కొడుకులకు శిక్షణ నివ్వటం ప్రారంభించారు. ఇలాంటి స్త్రీలందరి వేదనామయ జీవిత వారసత్వం నుండే ఈనాటి మహిళా ఉద్యమం రూపొందుతున్నది.

ఆర్థిక అసమానతలను, అందులో భాగంగా స్త్రీల మీద అమలవుతున్న కుటుంబ హింసను, వాటిని బలపరిచే రాజ్యాన్ని తిరుగు లేకుండా కొనసాగేట్లు చేయటంలో ధార్మిక నైతిక సూత్రాల కంటే, శాసనాల కంటే పటిష్టమైన భావజాల వ్యవస్థను జీవితంలోకి చాపకింద నీరులాగా ప్రవేశ పెట్టిన మత సాహిత్య సంస్కృతులు ప్రముఖ పాత్ర వహించాయి. ఋగ్వేదం మొదలైనవాటిల్లో రాజులను స్తుతించటం ద్వారా వైదిక ఋషులు రాజ్యానికి మద్దతు ప్రకటిస్తే యజ్ఞం యాగాదుల పేరుతో రాజులకు ప్రజల విశ్వాసాన్ని, మద్దతును సమకూర్చి పెట్టే పనిని పురోహిత వర్గం విజయవంతంగా నిర్వహించింది. దివోదాసు, ప్రవాహణుడి కథల్లో ఈ విషయాలు ప్రస్తావించబడ్డాయి. బ్రాహ్మణ వర్గం, రాజ్యాధికార వర్గం అనుభవించే అతీతమైన అధికారాలు, అవకాశాలు, భోగాల గురించి ఎవరూ ఏమి ప్రశ్నించకుండా వుండటానికి బలమైన సాధనంగా పూర్వజన్మ కర్మ సిద్ధాంతాన్ని, పునర్జన్మ సిద్ధాంతాన్ని ప్రవాహణుడు ప్రచారంలోకి తెచ్చాడు. రాజుల బ్రాహ్మణుల అధికార బలాన్ని దృఢపరిచే భావజాలాన్ని సాహిత్యాంశంగా చేసుకొని కాళిదాసు

లాంటి వాళ్ళు స్వప్రయోజనాపరులై సాహిత్య సృష్టికి పూనుకొన్నారు. ఈ మత సాహిత్య సంస్కృతి బ్రాహ్మణ పెత్తనాన్ని, రాజ్యాధికారాన్ని తిరుగులేని శక్తులుగా ప్రతిపాదించి వర్ణ, వర్గ అసమానతలు వైరుధ్యాల గురించి ప్రశ్న పట్టకుండా కొన్ని వందల సంవత్సరాలు సమాజ చరిత్రను నడిపించింది. సాధారణ మానవీయ స్వభావం, బౌద్ధమత ధర్మం- ఈ విధమైన సమాజ స్థితి పట్ల మొదట నుండి నిరసన వ్యక్తం చేస్తూనే వున్నా ఆ స్వరం చాలా బలహీనమై వినబడకుండా పోయింది. అయితే బ్రిటీషు వలస పాలనలో అన్ని అసమానతలను గురించిన అవగాహన పెరిగిన క్రమంలో అత్యంత దుర్మార్గమైన వర్ణ అసమానత ప్రధానంగా చర్చలోకి వచ్చింది. సవర్ణ హిందువులకు, అస్పృశ్యులుగా చెప్పబడేవాళ్ళకు మధ్య వైరుధ్యాలు తీవ్రతరం కాకుండా చేయటం కోసం జాతీయోద్యమ రాజకీయాలలో భాగంగా, గాంధీ, హరిజనోద్యమాన్ని నిర్మించాడు. ఆ సమయంలోనే దళిత జాతి నాయకుడుగా ఎదిగిన అంబేద్కర్ భారత రాజకీయ రంగంలోకి ప్రవేశించి దళితులకు రాజ్యంలో ఎటువంటి ప్రాతినిధ్యం వుండాలన్న విషయం మీద తన భావాలను బలంగా చెబుతూ వచ్చాడు. ఈ సాంఘిక వాతావరణంలో దళితుల ఆలోచనా దృక్పథం ఎట్లా రూపొందుతున్నదో ఉవరి కథ సుమేరుడు సుస్పష్టం చేస్తుంది. అశేష పీడిత దళితులకు ప్రతినిధిగా సుమేరుడు గాంధీ హరిజనోద్ధరణ పట్ల, ఉద్యమం పట్ల తీవ్ర నిరసనను వ్యక్తం చేస్తాడు. తరతరాలుగా తమ మీద సాగుతున్న పీడనకు, దోపిడీకి ఏ మాత్రం చలించని దేవుణ్ణి కూడా తాము విశ్వసించమని నిర్ద్వంద్వంగా ప్రకటించాడు. అయితే అతను అంబేద్కర్ మార్గంతో కూడా తృప్తి పడలేడు. పార్లమెంటరీ ప్రజాస్వామ్యంలో ఉపరితలాంశాలలో సమాన అవకాశాలను, స్వాతంత్ర్యాన్ని వాంఛించే అంబేద్కర్ పద్ధతి వల్ల అస్పృశ్యుల లోనూ కొంత మంది నెలకు అయిదారు వేలు రాబడి తెచ్చుకొనే వాళ్ళు తయారైతే తయారవవచ్చు కానీ, ఏ ఒకరిద్దరో జమిందారుల స్థాయికి చేరుకోవచ్చు కానీ మొత్తం మీద అస్పృశ్యుల స్థితిలో మార్పేమీ రాదని ఖచ్చితంగా అభిప్రాయపడతాడు సుమేరుడు. దళితులను ఒక ప్రత్యేక వర్గంగా గుర్తించటం, హిందూమతం కానీ కాంగ్రెసు రాజకీయాలు కాని వాళ్ళ ప్రయోజనాలను ఈడేర్చేవి కావని గ్రహించటం మొదలయిన కారణాల వల్ల 'సుమేరుడు' ఈ నాటి దళిత ఉద్యమానికి తాత్త్విక నేపథ్యాన్ని ఇచ్చిన వాడైనాడు. దళితుల అభివృద్ధికి అంబేద్కర్ ఆలోచనా విధానం ఒక మేరకు పనికి వచ్చినా, మొత్తంగా దళితుల అభ్యుదయానికి అవి దోహదం చేయదన్న సుమేరుడి ఆలోచన ఈనాటి దళిత ఉద్యమం పరిగణనలోకి తీసుకోవలసిన అంశమే. ఒక వర్గంగా అస్పృశ్యుల అభ్యుదయాన్ని ఆకాంక్షించిన సుమేరుడు ఫాసిస్టు వ్యతిరేక సోషలిస్టు ఉద్యమంలో భాగస్వామి అయినాడంటే దళితఉద్యమ→

# గద్దె

—బమ్మిడి జగదీశ్వరరావు

మామూలు ఎన్నికలంత గలాటా, గందరగోళం లేకపోయినా రాష్ట్రపతి ఎన్నిక కూడా పెద్ద చర్చనీయాంశమే అయిపోయింది. ఈసారి రాష్ట్రపతి ఎవరా? అని నాకు నేనే వెర్రి దామోదరంలా ఆలోచిస్తూ వుంటే... సెకండు ఫారము చదువుతున్న మా చిన్నిగాడొచ్చి... "రాష్ట్రపతి దేశానికి ప్రథమ పౌరుడు కదా?" అడిగాడు. "అవును" అన్నాను. "మరి రాష్ట్రపతి రబ్బరు స్టాంపు వంటి వాడని కూడా మా మాష్టారన్నారే" అన్నాడు.

చిన్నిగాడి మాటతో నా చిన్న మెదడు చిన్నగా వణకడం ప్రారంభమయింది. భారతదేశంలో నా పౌరసత్వానికి భంగం కలిగినట్లు భయపడి పోయాను. కాకపోతే మరేమిటి....? భారతదేశానికే ప్రథమ పౌరుడు రబ్బరు స్టాంపయిపోతే మిగతా పౌరులు....?

అయినా ప్రజాస్వామ్యం మీద నమ్మకం వున్న వాణ్ణి గనుక రాష్ట్రపతులంటే నాకెంతో గౌరవం. మరి అలాంటి గౌరవ స్థానాన్ని అధిష్ఠించే దెవరో? కాంగ్రెస్ వాళ్ళు తమ అభ్యర్థిని నిలబెడితే, బి.జె.పి. వాళ్ళు తమ అభ్యర్థిని బలపెడితే.... వామపక్షాలు బలం లేక మౌనం ప్రకటిస్తే.... అయినా రాష్ట్రపతి అన్ని రాజకీయ పార్టీలకు అతీతంగా వుంటాడు!!....

"తిన్న ఇంట్లో ఏరుగుతావా?.. నీ తెలివిగాని" మా నాయనమ్మ పెరట్లో సామెత కొడితే నన్నే కొట్టినట్లయింది. కాంగ్రెస్ వాళ్ళు నిలబెడితే కృతజ్ఞుడవు

---

← విజయానికి ఎటువంటి దృష్టికోణం అవసరమో తన ఆచరణ ద్వారా నిరూపించి నట్లయింది

ఈ విధంగా రాహుల్ సాంకృత్యాయన్ మానవ సమాజాల పరిణామాన్ని ఒక చారిత్రక క్రమంలో నిరూపించటం ద్వారా వర్తమానాన్ని అర్థం చేసుకోవటానికి, భవిష్యత్తును నిర్మించుకోవటానికి కావలసిన జ్ఞాన సంపదను 'ఓల్గా నుంచి గంగకు' అన్న పుస్తకం ద్వారా మనకు అందించాడు.

తాజా రాష్ట్రపతి? ఉప రాష్ట్రపతి తనచా పదవిచ్చేసిన బి.జె.పిని వదులుకుంటాడా? నీ పిచ్చిగాని.... రాష్ట్ర ప్రభుత్వాల్ని రద్దు చెయ్య... అంతే చస్తాడు. వద్దంటే ఊనేస్తాడు! సంతకం శాసనం మీద పెట్టం చట్టమవుతుంది!' అంటే పడివాడు.... వద్దంటే అభిశంసన తీర్మానం వుంటుంది. పదవి పోతుంది...

'వామ్మో... ప్రజాస్వామ్యాన్ని నమ్మిన నాలో ఏమిటీ పెడధోరణి?...లేదు.. లేదు... ప్రజాస్వామ్యమంత గొప్ప వ్యవస్థ లేదు... అందుకు భారతదేశమే ప్రతీక. అంటూ నన్ను నేనే భుజం తట్టుకొని స్థిమితపడ్డాను.

"నాయనోయ్..." చిన్నిగాడి గావుకేక. పెరట్లోకి పరిగెత్తాను, నే వెళ్ళేసరికే వాడు మొలుచుకొచ్చిన గడ్డిని పీకుతున్నాడు. నేను కూడా వాడితో కలిసి గడ్డి-పీకడం మొదలెట్టాను.....

పీకి పీకి చేతులు పోయాయి. గడ్డి తరగదే—?!

పెద్ద సమస్యొచ్చి పడింది.

అది గడ్డి సమస్య!

మా ముత్తాతల నుంచి మటం చిద్దిన నాగాలో మా తాత ఇల్లు—కట్టాడు మా నాయనేమో ఎలువ కట్టాడు. మరి నేనేమో గడ్డి పీకుతున్నాను. మా 'శక్తి' కొద్దీ ప్రజా'స్వామ్యాన్ని' పెంచుకుంటూ జాగ్రత్త పడుతూనే వున్నాం.

కాని గడ్డే—?!

అసలు మా తాతలూ అయ్యలూ మంచి పస్నిమటం చేసినా, నేల ఈన్నట్టు గడ్డి బలిసిపోయుండేదట. 'గడ్డీ సుప్పు జాగా నాం చెయ్య' అన్నాం వినదే,.... మీ(పు) పూరుకుంటెలగవుద్ది ... అందుకే గొబ్బులు గోతు లా తవ్వి ఇబ్బల్లు దింపినాం! శాంతి....శాంతి అన్నాం!!

ఇనప గుమ్మలాటి రాయిపిక్క తెచ్చి, చట్టీల్లాటి ఇటుకలు పేర్చి సిమ్మెంటు తాపించినాం. ఇల్లు లెగిసి పోయింది. ఇంటి మీద గడ్డీ లెగిసిపోయింది. దావెమ్మని ... అదేం సిత్రమో.... కాంక్రీటు గోడలు కూడా మొలిచిపోయింది గడ్డి! ఆ రాయి చెట్టు లెగిసి గోడ పగులిచ్చేసింది.

....చిక్కన కోటా చిగురులేస్తందే ...?!

ఇక లాభం లేదని పెరికిన గడ్డి తెచ్చి పెరట్లో పడేస్తే.... ఇప్పుడు పెరడంతా పెరిగి....పాకి పోతోంది.

చిన్నిగాడు చేతులు నొప్పెడుతున్నాయని లేచి వెళ్ళిపోయాడు.

నేనూ అలసిపోయి ఆలోచించడం మొదలెట్టాను. అసలీ భూమ్మీదే గడ్డి లేకుండా చేస్తే ...? ఎంత పేరొస్తుందీ....పేరు మాటకేం కాలుకదపకుండా తిని తొంగోవచ్చు!....

ఇంతలో నాయనమ్మొచ్చింది. ఆ గడ్డి పోచలని చూస్తేనే తన చేతులా తెగి పోయాయని చెప్పింది. రక్తం కూడా కారిందని చెప్పింది. అసలు ఆ నేల వల్లేనట గడ్డి! ఆ గడ్డికి నేలే దన్నట. ఆ దన్ను లేకుండా అంటే నేల లేకుండా చెయ్యడం నీవల్లా నావల్లా కాదంది.

నాలో పట్టుదల పెరిగి పోయింది. ఎలా అయినా గడ్డిని నేలమీద- లేకుండా చెయ్యాలని పించింది. అసలు గడ్డి పుట్టకుండా చేసి తీరాలనిపించింది.

గడ్డికి నీరందకుండా చేసాను. అయినా చావలేదు. ఎండలో మాడి మసయి పోతుందనుకుంటే మరికొంచం నిగనిగలాడడం చూసి కుతకుతలాడిపోయాను. గడ్డి మీద ముళ్ళే పరచాను, కట్టాను ... కొట్టాను.... ఊహూఁ.... లొంగలేదు వంగ లేదు గడ్డి కర్రల్ని తెంపి మా 'పశువుల' సాలలో వేసాను. కొన్ని బలిసిన పశువులు మేస్తూనే వున్నాయి. మరిన్ని గరికలు పుడుతూనే వున్నాయి.

నేను ఇంటికి యజమాన్నయినా మా హోమ్ డిపార్టుమెంటు హెడ్ని.... అంటే మా ఆవిడని పిలిచాను. దోసెడన్ని ఐడియాలు వేసుకున్నాం. చంకలు గుద్దుకున్నాం. "ఈఐదేళ్ళ (వుంటే) జీవితానికి నా హోమ్వి నీవే" అన్నాను. హోమ్ కూడా 'నా ఫోని నువ్వే' నంది.

తరువాత మా హోమ్ ఆమదాల వలస నుంచి అద్దెగాడిదల్ని పిలిపించింది. ఆ గాడిదల్తో గడ్డి పని సరనుకున్నాను. కాని అవేం గాడిదలో.... అద్దెగాడిదలు.... పొట్ట మొయ్యలేక ఎవర్నైనా వీపుమీద ఎక్కించుకు మొయ్యడానికి తప్పక అలనాటు పడ్డాయి. అయినా అవి తినగలిగినంత తిన్నా, మాయదారి గడ్డి మళ్ళీ పుట్టుకు వచ్చేది!

నేలమొయ్య గడ్డి తవ్వినాసరే వారం రోజులకల్లా మొలకల్లేచి నెలరోజుల యేసరికి మళ్ళీ అడవే! ఆ గడ్డిని చూస్తూ "గరిక తిన్న గాడిద చస్తుంది గాని గరిక చావదురా" మా నాయనమ్మ అనేది.

గడ్డి గురించి నా పాట్లు చూసి నే చాలా కష్టపడిపోతున్నట్టూ, రిస్కు తీస్కున్నట్టూ మామంది ప్రచారం చేసారు.

నా ప్రచారం కంటె గడ్డి జోరుగా పెరుగుతూనేవుంది.

వాంతులొచ్చినట్లు ఆవేశం పెర్లి పెర్లి పోతుంటే పట్టలేక గడ్డిని కాల్చిపారె- య్యాలనుకున్నాను. ఇంట్లోకి వెళ్ళాను. గాడిదకో గన్ను పంచుకోమన్నాను ఒక్కొ- గరిక- పూసకి ఒకటో రెండో గుళ్ళు పోతే పొయ్యాయి, కాల్చిపారేయమన్నాను. మొత్తం కాల్చి పారెయ్యాలనే దుగ్ధతో మాకు కేంద్ర బిందువయిన మా అత్తారి నుండి (వారు ఫారెస్టు ఆఫీసర్లులెండి) రైఫుల్లూ .. రాకెట్లూ....తెచ్చా, కాల్చా.... కూర్చా....

గడ్డి చావదే .. దానికి నేల దన్నుంది!

ఒక వైపు ఏరిపారేస్తూ, కాల్చేస్తూ, సాలలో పశువులు తింటూ వున్నా.... ఎంతయినా గడ్డి గడ్డే! లేకపోతే ఇరవైమూడేళ్ళ క్రితం మా వెంగలప్ప బాబాయ్ ఈ గరిక చావాలని... యాసిడ్ పోసాడంట! చాలా గరికలు అప్పుడు చచ్చిపోయాయి అప్పుడే మా వెంగలప్పకి పెద్ద బిరుదు ఇచ్చి ఇంటిల్లిపాది అభినందించేసాం.

ఆ దురద నాకూ వుందని మా నాయనమ్మ అంటుంది గాని 'ఈ గడ్డి చస్తే... హాయిగా....స్వేచ్ఛగా....ప్రజాస్వామ్యంగా.... అదే చోట గంజాయి మొక్కలు పెంచుకోవచ్చు! తద్వారా మా కుటుంబం, తర్వాత దేశం ఆర్థికంగా ఎంతో సు'భిక్ష' మవుతాయని తెలుసుకోదు.

'వేలెడంత లేని గరికల్ని చూసి భయపడవద్ద'న్నాను. మీరెవ్వరూ గడ్డికి నీళ్ళు పొయ్యొద్దని .. పుట్టుకోవద్దని.... ముద్దులాడవద్దనీ ఇంటా బయటా ఆజ్ఞలు జారీచేసాను. పిల్లలకి ఇంకా గడ్డి పట్ల ప్రేమ వుండటాన్ని సహించలేకపోయాను. గడ్డిని జాలిగ ప్రేమగ చూసిన పిల్లల్ని ఏ మాత్రం జాల్లేకుండా చితక్కొట్టించాను. కాళ్ళూ చేతులూ విరిచి కొట్టుగదిలో పడేసాను.

మేం పెట్టిన హింసవల్లగానీ.... గడ్డి రాటుతేలి ఇలా ఈరోజు కనిపించినా, దాని రంగూ, మృదుత్వం, ఏపూ.... తక్కువేం కాదు. అందుకేమో మా పిల్లలంతా నా అధీనంలో వుండకుండా నా మంత్ర దండంకి లొంగకుండా గడ్డి వేపు ఆకర్షితులవుతున్నారు. ఒక్క మాటలో చెప్పాలంటే గడ్డి పరుపులా ఒత్తిగిల్లి సృజించేది!

అందుకే గడ్డంటే నాకు భయం. గడ్డి మా కంపే గొప్ప పేరు కొట్టేస్తే పరవాలేదు గాని, మరి పదవో? గడ్డికి పదవి వద్దట. అయినా దేశం నిండా అందంగా అల్లుకుపోతే....అలుక్కుపోతే... అమ్మో గడ్డి.... గడ్డి బతకగూడదు.

గడ్డి బ్రతకదు.... గడ్డి చస్తుంది.... గడ్డి కాలి బూడిదై.... ఏ నేల దన్ను చూసి వి(తి)రగబడిందో.... ఆ నేల్లోనే.... మట్టిలో మట్టై కలిసిపోతుంది. 'అహహ్హా....హి...హి...హ్హీ... చూడండి అవతలారి ఎలిసితిస్ను మావ దాన్ని నిరూపించాడని అందరికీ దండోరా వెయ్యక ముందే- మా చిన్నిగాడొచ్చి "నే వేసవి సెలువుల్లో వెళ్ళి చూసొచ్చాగా... ఆ గడ్డి మన ఇంట్లోలా పచ్చగడ్డి కాదు. ఎండు గడ్డది నాన్నా... ఎత్తురుకుంది" ఒక్క మాటలో కొట్టిపారేసాడు.

"ఆఁ... ఎండుగడ్డి నిప్పెడితే కాలిపోవడము సిత్రమూ కాదుగానీ, కాలిన బూడిద నేల్లో కలిసిందా.... ఆ నేల్లోంచే మళ్ళీ గరికలు లేస్తున్నాయట... ఏమైనా నేలున్నంతకాలం ఆటి దన్నుతో గడ్డి పుడతాది... బతుకుతాది..." నాయనమ్మ చెప్తుంటే గడ్డిని ఇంతకాలం నిర్బంధించినా నిషేధించాలనిపించింది. అయ్యి సచ్చిన రోజే అది అమల్లోకి వచ్చింది. [తరువాయి 27 వ పేజీ]

# నీ జంటగ నేనుంట రారా చిన్ని తమ్మయ్య



నీ కన్నీరు నా కన్నీరు కలిగినోళ్ళకు పన్నీరాయె
ఒంటిగా ఓ శోకం బెట్టే చిన్ని తమ్మయ్య
నీ జంటగా నేనుంటా రారా చిన్ని తమ్మయ్య

తెలిసి తెలియని వయసులోనే / కన్నోరి విడిసి వెళ్ళిపోయిరి....
చెత్తకుండే తండ్రై సాకెనా చిన్ని తమ్మయ్య
నీళ్ళ పంపె తల్లయి సాకెనా చిన్ని తమ్మయ్య

ఆడి పాడె వయసులోనె / చదువూ సంధ్యా ఏమి లేకా....
గొర్లగాసి బర్లగాసి చిన్ని తమ్మయ్య
నువ్వు గొడలలో గలసినావా చిన్ని తమ్మయ్య
కనబడ్డోళ్ళ కాళ్ళ విడువక-పాలిష్ చేస్తే....
పట్టెడన్నం నీకు కరువా చిన్ని తమ్మయ్య
నువ్వు పస్తులే కండ్ల చూసినావా చిన్ని తమ్మయ్య

నీ సీము నెత్తురు పిండుకోని / వోటెలోళ్ళు బలిసిరి కాదా....
సీసు కారి చేతులు మండితె చిన్ని తమ్మయ్య
నీ గుండె చెరువై ఏడ్చినావా చిన్ని తమ్మయ్య

బంగ్లా బాడిసి బాసండ్లు తోమి / కల్గినోల కాల్లెబడితె....
తినబోతె ఎంగిలికూడు చిన్ని తమ్మయ్య
నీ వీపు నిండ ఎర్రని వాతలు చిన్ని తమ్మయ్య
మండుటెండలో రిక్షా దొక్కి
శోష వచ్చి కింద పడితె

కల్గినోడి కారె పోయెనా చిన్ని తమ్మయ్యా
నీ కాలు యిరిగి కుంటోడై తివా చిన్ని తమ్మయ్యా
కనోర్ని నెరుగవు ఉనోన్ని నెరుగవు
సర్కారుండి ఏమి లాభం....
సర్కారింక మనకూ వొద్దు చిన్ని తమ్మయ్యా
దీని సత్తె నాశనం చెయ్యాలయ్యో చిన్ని తమ్మయ్యా
బతుకు పోరు దారిలోనా, ఎర్రని జెండా లెత్తుకోని
ఉద్యమానికి ముందు నడువు చిన్ని తమ్మయ్యా
ఎర్రని తోవలో పరుగులు వేయి చిన్ని తమ్మయ్యా
నీ జంటగా నేనుంటా రారా చిన్ని తమ్మయ్యా
మన ఎర్రని జెండా తోడుందయ్యో చిన్ని తమ్మయ్యా

—సాహు.

---

(25 వ పేజీ తరువాయి)

'నేను గట్టిదాన్నే' అనుకుంది నాయనమ్మ.

'గడ్డి నాకంటే గట్టిదేమో' అనుకున్నా నేను.

అయినా గడ్డికి జీవించే హక్కులేదని కాలరాస్తున్నా, ఆ గడ్డి మండిపోయిన గడ్డి ఇప్పుడు మా ఇంట్లోనే కాదు... ఇరుగూ పొరుగూ ఇళ్ళలో కూడా... ఊరు ఊరంతా తీసిన చోటా... తియ్యని చోటా, అసలు నేలవున్న ప్రతిచోటా గడ్డే గడ్డి!

"నేలలో ఇంత సారమెక్కడిది?" ప్రశ్నించుకొని మట్టిని తీసి పరీక్షకు పంపించాను. శాస్త్రజ్ఞులు మట్టి మీద అనేక పరిశోధనలు జరిపారు. రిపోర్టు పంపేరు.

"వర్షాలు ఋతువుల బట్టీ కురుస్తాయి గాని చెమట ధారలు కట్టి పారడానికి ఋతువులతో పనిలేదట. కష్టంలోంచి చెమట పుట్టి మట్టిలో ఇంకి పోతుందట. ఆ మట్టిలోంచి గడ్డి మొలుస్తుంది. ఆ ఇంకిన చెమతే ఆ నేల సారానికి మూలం."

ఆ రిపోర్టు చదివాక గడ్డికి అంతశక్తి ఎలా వచ్చిందో అర్థమయింది నాకు. అలా అని ఊరుకుంటే గడ్డి విషయంలో ఓటమిని అంగీకరించిన వాడనవుతాను. అందుకే గడ్డి ప్రకృతి అంత విజయమయినా రాజీపడే ప్రశక్తి లేదు. మట్టిని చేతుల కంటించుకొనే ప్ర'శక్తి' అంతకన్నా లేదు.

అందుకే గడ్డి మీదకు గాడిదల్ని తోలాను. గన్ను ఇచ్చాను.

గడ్డి లేకుండా చెయ్యాలంటే నేల లేకుండా చెయ్యాలి!

కాని నేల లేకుండా నేను లేనే...?!

నేలలో సారమూ తగ్గదు. ఆ నేల దన్నుతో గడ్డి పెరగడమూ మానదు.




# కలల మేఘం నిజాల్ని వర్షిస్తుంది

కవితా రచనాపరంగా విప్లవ కవిత్వంలో రెండు దశల్ని స్పష్టంగా గుర్తించ వచ్చు. 1970 నుండి 80 వరకు ఒక దశ. ఈ కాలాన్నే "కల్లోల దశాబ్దం" అని పిలుస్తారు. రెండోది 1980 నుండి ఈనాటిదాకా ఉన్న దశ. విప్లవ కవిత్వ ప్రారంభ దశల్లో విమర్శకులు కొన్ని నిశ్చలమైన సిద్ధాంతాల్ని ప్రచారం చేశారు. వాటిలో ముఖ్యమైన వాటిలో కొన్ని-వస్తువులు మాత్రమే ప్రధానం కావడం చేత శిల్పమనేది ఏమాత్రం విలువ లేనిదని, కాల్పనికమైన (Romantic) శైలి కనబడ్డమే అపరాధ మనీ, ప్రయోగాత్మక రచనలన్నీ వక్ర మనస్కులు మాత్రమే చేసేవనీ— స్వయం ప్రతిభ గల కవులెవరూ (శివసాగర్, చెరబండరాజు మొ॥) ఈ సిద్ధాంతాల్ని పట్టించుకోకపోయినా, అప్పటి యువతరంలో చాలా మందిని ఇవి ప్రభావితంచేసినై శిల్పమనీ, కాల్పనికత అనీ, ప్రయోగమనీ మాట్లాడ్డానికి జంకు పుట్టించే వాతావరణం ఉండేది. ఈ మాటలన్నవాడికి అసలు విప్లవ భావన అనేదే అవగాహన కాలే దన్నంతవరకూ ఈ వాతావరణం వ్యాపించి ఉండేది. ఒక విచిత్రమైన సంఘటన కూడా నాకు గుర్తు. కాల్పనికతకి వ్యతిరేకత బాగా ప్రకటించబడే కాలంలో, 1978 డిసెంబరు 'Chinese Literature' పత్రికలో Mao Tun రాసిన 'On Creative Writing' అనే వ్యాసం వచ్చింది. అందులో కవిత్వం 'Revolutionary Realism', 'Revolutionary Romanticism' అని రెండు విధాలుగా విభజింప బడింది. వాటి నిర్వచనాలు ఈ కింది విధంగా ఇవ్వబడినై. "The writer who presents what he considers is social reality based on his own observations and analysis is a Realist. He reveals his own political thinking and individual will. Romantic writers, on the other hand, express their ideal, will and political thinkin through their imagination and fantasy".

"Only a Marxist world - outlook can develop positive romanticism to confirm with the laws of social development and thus produce Revolutionary Romanticism!"

Revolutionary Realism, Revolutionary Romanticism - అనే రెండు పద్ధతులూ మావో కవితల్లో ఉన్నాయని చెప్పబడింది ఈ వ్యాసంలో. ఈ వ్యాసం రాగానే, ఎవరు రాశారో గుర్తులేదు గాని, కాల్పనికతని సమర్థిస్తూ ఒక వ్యాసం రాశారు. విప్లవ భావంలో కరిగిపోయే కాల్పనికత వల్ల ఏమీ దోషం లేదని, అసలు నిజం ఏమిటంటే ఎటువంటి కవితా పద్ధతులూ విప్లవ కవికి దూరం కావు. తన భావాన్ని సమగ్రమైన స్పందన కలిగించేటట్లు చెప్పడానికి, ఏ పద్ధతి అవసరమైతే దాన్ని తీసుకుంటాడు. మొత్తం మీద తాను కోరిన స్పందన కలిగించడం ప్రధానం. 1980 తర్వాత ఈ భావానికి బాగా గుర్తింపు లభించింది. యిదీ వెర్రి తలలు కూడా వేసిన సందర్భాలూ ఉన్నై. విప్లవ భావాల్ని సాధ్యమైన అస్పష్ట భావ చిత్రణల మాటున దాచేసి, విప్లవ కవుల మనుకునేవారు కూడా లేక పోలేదు. లేదా చాలా మంచి కవులు గూడా ప్రయోగాల మాటున అస్పష్ట కవితలు రాయడం గూడా జరిగింది. ఈనాడు కూడా జరుగుతోంది.

ఈ నేపథ్యంతో చూస్తే విప్లవ కవిత్వమంతా నినాదప్రాయం అనుకునే పాఠకుల అభిప్రాయాల్ని తుత్తునియలు చేసే ఎన్నో అత్యుత్తమ కవితాత్మకమైన విప్లవ కవితా సంపుటులు సుమారుగా 1980ల తర్వాత అసంఖ్యాకంగా వచ్చినై.

నారాయణస్వామి 1992లో వెలువరించిన 'కల్లోల కలల మేఘం' కవితా సంపుటి పై అభిప్రాయానికి నిదర్శనమైన పుస్తకం. కొంతమంది విప్లవ కవులనబడే వారు, విప్లవ భావనకి సంబంధం లేని కవితలు కూడా చాలా రాసి ఉండవచ్చు గాని నారాయణస్వామి కవితల్లో విప్లవ భావన ప్రవహించని కవిత లేదు. యిదీ కవి నిమగ్నతకి నిదర్శనం. అంతేగాక అన్ని కవితలూ చదివిన తర్వాత పాఠకుని మనస్సులో విప్లవ భావన మాత్రమే ముద్రింపబడుతుంది గాని, అందులో వివిధమైన సంకీర్ణతకీ తావుండదు. మరో విధంగా చెప్పాలంటే అన్ని కవితల్లోనూ విప్లవ భావనే అంతస్స్రవంతిగా ఉంది, విప్లవోద్యమంపై ఆయన చెక్కు చెదరని విశ్వాసం మొదటినించి చివరదాకా అగ్ని జ్వాలలా రగులుతూ ఉంటుంది. 1992లో ఆయన రాసిన 'తల్లి కంటి నీరు తుడిచేందుకు' అనే కవితలో యిలా అంటారు :

"మరణం లేని మార్పును బుజాన వేసుకుని
భూమి చెంప మీద కన్నీరు తుడిచేందుకు వొరిగిన అమరులకు
మాతృగర్భమై పునర్జన్మనిస్తూ
అవిచ్ఛిన్నంగా సాగుతోంది విప్లవోద్యమం"

తప్పక ప్రజలు జయిస్తారన్న విశ్వాసం, ఆశావాదం కూడా ఈయన కవిత్వానికి బలాన్నిచ్చై. 'మృత్యువొక్కటే నిజంకాదు' అనే కవిత యిలా ముగుస్తుంది :

చెదరని గురి - సడలని అడుగూ — ఎగసిన నినాద జెండా

ఇదీ నేటి చరిత్ర
చరిత్ర నపహాస్యం చేసేవాళ్లూ చరిత్రని వక్రీకరించే వాళ్లూ
చరిత్ర నుండి నిష్క్రమిస్తారు - తప్పదు —
ఇవాళ ప్రశ్నార్థకాలై మెరుస్తున్న నక్షత్రాల కొసలకి
రేపు వాణ్ణి ఉరి తీస్తారు
ఇది భవిష్యత్తు"

సాయుధ పోరాట రంగాన్ని వదిలి బయటికి వచ్చిన వారిని గూర్చి బాధపడటం కూడా ఈయన కవితల్లో కనిపిస్తుంది :

"తన పలుకుల చిలకల నోళ్ళలో నిన్నొక సంచలనం చేసి
నిన్నొక జనాకర్షక వస్తువుని చేసి
భుజమ్మీద తుపాకితో ఉన్నపళంగా నిన్ను
రాజ దండం
తన కుట్రకు లోబరచుకొనే
ప్రహసన క్రమమంతా
నిన్ను నిరాయుధుణ్ణి చేయడానికే
చరిత్ర కూడలిలో నిన్ను దోషిగా నిలబెట్టడానికే !"

విప్లవోద్యమంలో సాయుధ పోరాట దశలూ ఉంటాయి; ప్రజోద్యమాల దశలూ ఉంటాయి. ప్రజోద్యమాలను తీవ్రంగా తిరస్కరించిన దశ 1970-75ల మధ్య ఉండేది. తర్వాత క్రమంగా ప్రజా సంఘటితోద్యమాలకు కూడా బాగా ప్రాధాన్యం వచ్చింది. నారాయణస్వామిది ఎక్కువగా సాయుధ సంఘర్షణో త్తేజంతో నిండిన కవిత్వం.

అయితే, నారాయణస్వామి 1982 నుండి 1992 దాకా రాసిన కవితలు ఈ సంపుటిలో ఉన్నై; 90 నుండి రాసిన కవితల్లో వస్తు విస్తృతికి సంబంధించిన దృక్పథం కనిపిస్తుంది. 1991 లో రాసిన 'మనిషి కోసం అన్వేషణ'- అనే కవిత, పెట్టుబడిదారీ యాంత్రిక నాగరికతా ప్రవాహంలో కొట్టుకుపోతున్న మనిషిని గూర్చి చెప్తుంది. చాలా బలమైన అభివ్యక్తి ఈ కవితలో చూడగలం మనిషిలోని సహజత్వాన్నీ, ఆరోగ్యాన్నీ, మానవత్వాన్నీ మనిషి నుండి లాగేసుకుని మార్కెట్ సరుకులు ఉక్కిరి బిక్కిరి చేస్తుంటే తనకోసం తను చేసుకునే మనిషి అన్వేషణ ఈ కవితలో పాఠకుణ్ణి ఊపిరాడనియ్యని శైలిలో సాగుతుంది. వ్యంగ్యం గూడా ఈ శైలికి బలమిస్తుంది.

"తన దగ్గరున్న స్వేచ్ఛను అమ్మి కొంచెం భద్రతనూ
కొంచెం జీవితాన్నీ కొనుక్కుందామని
ఓ ఆధునిక కొట్టులో కెళ్ళాడు మనిషి

కోట్టువాడు మనిషి రెండు కాళ్ళూ కాసేపు ఫ్రిజ్‌లో పెట్టి
ముఖాన్ని బలవంతంగా లాగేసుకుని ఓటాల్కుం పౌడరిచ్చి
గెంటేశాడు....”

వర్తమాన నాగరికతలో మనిషి పొందే పరాయీకరణ గూర్చి ఈ మధ్య వచ్చిన కవితల్లో, ఇది ప్రథమశ్రేణికి చెందుతుంది.

అలాగే 'శంబూకుని ఊరేగింపు' (1990) ప్రతీక ప్రధానంగా సాగిన దళిత చైతన్య కవిత. శ్రమ దోపిడి చేసే అగ్రవర్ణాల వారిని 'సీతాకోక చిలుకలు' గానూ, దళితుణ్ణి 'శంబూకుడు' గానూ సంకేతించి దళిత పోరాట ఆవశ్యకతను తీవ్ర కవితాత్మకంగా చెప్తుంది ఈ కవిత.

“పిచ్చి శంబూకుడా! నీ తలపై స్వారీ చేస్తున్నది
నిన్ను హత్య చేసిన రాముని శవం
ఆ శవాన్ని దించేసి దగ్ధం చెయ్!”

ఈ పంక్తుల్లో దళితుడు మోస్తున్న హంతక సదృశమైన భావజాలాన్నంతటినీ తగలబెట్టాలనే ధ్వని చాలా బలంగా ఉంది.

నారాయణస్వామి శైలిని ఒక అగ్ని ప్రవాహంతో పోల్చవచ్చు. దానికి కారణం ప్రతి పంక్తిలోనూ విప్లవ భావాలు వేగవంతమైన పదాల పొందికతో కూడి ఉండడమే. ఆ వేగం ఎలాటిదంటే, అధికమైన భావ చిత్రాలూ, అలంకారాలూ కల్పనలూ లేకపోయినా, స్పందింప జేస్తుంది. ఈ పదాల ప్రవాహం, కవి మనస్సులోని తీవ్ర భావావేశ ప్రవాహానికి ప్రతిబింబం.

“మేం ప్రాణంకన్నా మిన్నగా వెలుగుని ప్రేమిస్తాం
వెలుగును మింగేస్తోన్న చీకటి ఛాయల్ని ద్వేషిస్తాం
మేం జీవితాన్ని ప్రేమించి అక్కున జేర్చుకున్న వాళ్ళం
జీవితం కోసం ప్రాణాల్ని పణంపెట్టిన మానవున్ని
ఊపిరి కన్న మిన్నగా హృదయంలోకి పీలుస్తాం”

నారాయణస్వామిలో ప్రత్యేకంగా చెప్పుకోవలసింది ఆయనలోని కాల్పనిక భావన. హృదయంలోని మెత్తనిచోట్లని స్పృశించేటట్లు, అతి సుకుమారమైన భావాల్ని చెప్పగలడు. ప్రకృతి సౌందర్యాన్ని తీసుకున్నా, లోలోపలి అనుభూతుల్ని తీసుకున్నా, ఆయన ఆవిష్కరణ ఎంతో లోతైన భావుకతని ప్రతిబింబిస్తుంది. ఇలాటివి విప్లవ కవికి ఉండరాదనే వారితో నేను ఏకీభవించను. వాటికవేలక్ష్యంగా చెప్పేవాడు స్తబ్దుడు గానీ, వాటిని ప్రగతి భావంతో మిళితం చెయ్యగలవాడు చైతన్య వంతుడే. అలాటి చైతన్యం నారాయణస్వామిలో ఉన్నత దశలో ఉంది.

"రాత్రి వణుకుతున్న పెదాల మీద
ఘనీభవించిన కాలం మంచు బిందువుల్లోనూ
గాలి మోసుకొస్తూ మధ్యలోనే ఆగిపోయిన సుమార సంగీతంలోనూ
తీరంపై నురగలు కక్కుతూ రాలిపోయిన కెరటాల గుర్రాల్లోనూ
నిద్రలేమి రాత్రుల ఎర్రబారిన కళ్ళ కింద
నల్లని చారికల వ్యథా భరిత విషాదంలోనూ
దోసిలోని ఎరకోసం ఒళ్ళంతా కంపించి
బందీమైపోయిన చిట్టెలుకల ఆత్రంలోనూ
నువ్వే కనిపిస్తావు నేస్తం!"
"గొంతులోంచి తన్నుకు వచ్చే ఏడ్పు
శిలై కళ్ళ కడ్డం పడ్డప్పుడు
మసక మసకైన జ్ఞాపకాలు -
బతికినంత కాలం నెత్తురునీ ఎముకల్నీ అరగ దీసి
రక్త సంబంధాల కోసం
కాళ్ళని నిరంతరం తిరిగే బండి చక్రాలు చేసి
దుమ్ములో ఎర్రటి ఎండతో ముళ్ళలో నగ్న పాదాల గాయాలతో
ఆకలితో చివికిపోయిన కడుపుతో
ఎన్ని సంవత్సరాలు ఎన్ని సంవత్సరాలు
ఎంత యవ్వనాన్ని ఎంత జీవితాన్ని ఒడిసావో!"
"కోడి గుడ్డులా చితికిపోయిన రాత్రులు
విషాదం కమ్మిన ఆకాశం నుండి జిగటగా వర్షం!
నిశ్శబ్దంలోకి మౌన పాదాలతో నడిచి వచ్చే గాలి
పేరుకుపోయిన చీకట్లో ఒంటరితనం పొగలా కదుల్తోంది"

ఈయన కవితలో ఎక్కువగా సుదీర్ఘమైన వాక్యాలుండడం కూడా గమనించవచ్చు! అది ఆయన భావావేశానికి ఒక అభివ్యక్తి.

కేవల వస్తు చైతన్యం ఒక కవిని సమగ్రం చెయ్యదు. వస్తు చైతన్యం కవితా చైతన్యం ద్వారా వ్యక్తం కావాలి. నారాయణ స్వామిలో ప్రతి భావనలోనూ కవితా చైతన్యం ఉంది. అది వస్తువుని బలపరచడానికేగాని, దానిలో అది అంతమవడానికి కాదు. ఆయన 82, 83 ప్రాంతాల్లో రాసిన వాటిలో కొన్ని నినాదప్రాయంగానూ, అవగాహనా రాహిత్యంతోనూ ఉన్నైగాని, అవి ఈ సంపుటిలో →
మూడు నాలుగు మాత్రమే.

లెండిర లెండి హో రండిర రండి
రండిర రండి హో లెండిర లెండి
ఓహో ..... రైతుకూలి పేదన్న
ఓహో..... కష్టపడె కార్మికన్న
డంకెలోడురో ప్రజల దొక్కలను చీల్చుతుండు
డంకెలోడు వాడు పెద్ద దొంగ దొంగ దొంగ ॥లెండిర॥
ఓహో........రైతుకూలి పేదన్న
ఓహో........కష్టపడె కార్మికన్న
అమెరిక దేశంలో వుండి అన్ని దేశాల మీద
"పేటెంట్" చట్టం పెట్టి పెత్తనం జేస్తడాట -హా-
వాని పేరు వూరు లేకుండ జెద్దాముర రైతన్న
ఓహో.... ...రెతుకూలి పేదన్న
ఓహో........కష్టపడె కార్మికన్న
మనం పండించిన పంటమీద మనకు హక్కులేదంట
వాడిచ్చిన గింజలతో, పంటలు పండించాలే

(తరువాయి 35 వ పేజీ)

---

← విప్లవ కవిత్వానికి సమగ్ర ప్రతిబింబం 'కల్లోల కలల మేఘం'. ఆయన సందేశంతో ఈ సమీక్ష ముగిస్తాను :

"ఒంటరిగానో
సమూహంగానో
నల్ల మబ్బుల ఒడిలో పురి విప్పిన నెమళ్ళను
నిర్బంధించే అధికారాన్ని
మనసా వాచా కర్మణా ధిక్కరిద్దాం!"

—అద్దేపల్లి రామమోహనరావు

కల్లోల కలల మేఘం (కవితా సంకలనం) నారాయణ స్వామి, ప్రచురణ విరసం సిటీ యూనిట్, హైదరాబాదు
పేజీలు : 96 వెల : రు. 15-00
ప్రతులకు : నవోదయ బుక్ హౌస్,
3-3-865, ఆర్య సమాజ్ రోడ్డు ఎదుట, హైదరాబాదు - 500 027

---

# డంకెల్ డ్రాఫ్టులో ఏముంది ? మొక్కల పేటెంటింగ్‌ను ఇండియా ఎందుకు తిరస్కరించాలి ?

— డా॥ సుమన్ సహాయ్

కన్వీనర్ - జీన్ కాంపైన్

సమస్య : మన దేశంలోని వివిధ రకాల మొక్కలకు, జన్యువులకు విదేశీ పేటెంటింగ్ పద్ధతిని అనుమతించాలని డంకెల్ డ్రాఫ్ట్ కోరుతోంది.

దీనివల్ల నష్టపోయేది ఎవరు? · 65 కోట్ల భారతీయులు. దేశవ్యాప్తంగా వున్న పెద్ద, చిన్న రైతాంగ కుటుంబాలు.

తక్షణం ఎదుర్కొనే సమస్యలు : వ్యవసాయ పరిశోధన ఆగిపోతుంది. విత్తనాల ఉత్పత్తిపై విదేశీ కంపెనీలు అదుపు సాధిస్తాయి. ఈ కంపెనీలకు రైతులు బానిసలైపోతారు. ప్రతి పంటకూ తమకు కావాల్సిన కొత్త విత్తనాలను వేలాది రూపాయలు వెచ్చించి కొనుగోలు చేయాలి. **ఎవరికి వారు తమ స్వంత విత్తనాలు తయారు చేసుకోవడంపై నిషేధం వుంటుంది.**

దీనిని ఎవరు అమలు చేయాలి? ; డంకెల్ డ్రాఫ్ట్ ప్రకారం ఈ పేటెంట్ రక్షణను భారత ప్రభుత్వం చేయాలి.

రైతుల భవిష్యత్తు ఎలా వుంటుంది? : ప్రతి పంటకాలంలోనూ పేటెంట్ ఉన్న విత్తనాలను కొనలేక, చివరకు వారి భూములను అమ్ముకొని, భూమి లేని వారుగా దిగజారతారు. కొందరు నగరాలకు వలసపోతారు. అత్యధికులు ఆకలితో మాడి చనిపోతారు.

కనుక మనం ఎదుర్కొనే సమస్యలేమిటి? : రైతులు ఈ పిచ్చి చట్టాలనూ, అన్యాయమైన చట్టాలనూ ధిక్కరించి, తమ విత్తనాలు తామే తయారు చేసుకుంటారు అప్పుడు ప్రభుత్వం ఈ రైతులను చట్టబద్ధంగా శిక్షించాలి. ఫలితంగా, దేశవ్యాప్తంగా పెద్ద ఎత్తున హింసాత్మక ఘటనలు జరుగుతాయి.

మనం ఏం చేయాలి మరి? : మా జన్యువులనూ, మా వ్యవసాయ సాంకేతిక పద్ధతులనూ ఏది ఏమైనా సరే మేము రక్షించుకుంటామని ప్రపంచానికి ఎలుగెత్తి చెబుదాం. అంతేకాదు. మా రైతులు స్వేచ్ఛను కోరుకుంటున్నారనీ, భారత దేశం తన ప్రజలపై ఇతర శక్తుల అధికారాన్ని తిరస్కరిస్తుందనీ చెబుదాం.

మనం ఏం చేయగూడదు? : మనం డంకెల్ ముసాయిదాపై గ్రుడ్డిగా సంతకం పెట్టగూడదు. మన జన్యువులూ, వివిధ రకాల మొక్కలపై పేటెంటింగ్ పద్ధతిని తిరస్కరించాలి.

మీరు ఏ విధంగా సహాయం పడగలరు? : తాము సంతకాలు చేసే ఒప్పందాలలో వున్న మెలికలను అర్థం చేసుకోలేని భారత వాణిజ్య మంత్రిత్వ శాఖ వారు భారతదేశాన్ని ఇతర దేశాలకు అమ్మివేయకుండా అడ్డుకోండి. డంకెల్ ముసాయిదాపై సంతకం చేయడమంటే దేశం ఆర్థికంగా, రాజకీయంగా ఆత్మహత్య చేసుకున్నట్లేనని ప్రభుత్వానికి స్పష్టం చేయండి. బలవంతాలకు వ్యతిరేకంగా న్యాయం కోసం చేసే ఈ పోరాటంలో మీ సహకారాన్ని జీన్ కాంపైన్ అర్థిస్తోంది.

F-31 Green Park (Main)
New Delhi-110016

(డంకెల్ డ్రాఫ్ట్ గురించి వివరాలు వచ్చే సంచికలో)

---

(33 వ పేజీ తరువాయి)

ప్రకృతి మీద వున్న సంపదను దోస్తజాట
ఐ.యం.ఎఫ్ అప్పుతోటి అగమాగ మవుతుంటే
ఎరువుల రసాయనాల సాంకేతిక విలువపైన
కొత్త పద్ధతులు పెట్టి కొంప ముంచ జూస్తుండు -హా-
కొంప ముంచే కొత్త పద్దతి కోరలు పీకేయ రారా
ఓహో........రైతుకూలీ పేదన్న
ఓహో........కష్టపడె కార్మికన్న ॥డంకెలో॥
నీరు మీద - ఓహో / గాలి మీద - ఓహో
పంట మీద - ఓహో / మందు మీద - ఓహో
నీరుమీద గాలిమీద పంటమీద మందుమీద
పండ్లుబండే పచ్చనడవి ప్రతి ఒక్క దాని మీద
పన్నులేసి గుంజుతారు పవర్ పెంచుకుంటుండ్రు -హా-
రైతుకు వెన్నుముక లాంటి వ్యవసాయం కాపాడ
తెలివి ఒకని సొత్తు గాదు తెగించి నీవు ముందు కురుకు
కార్మికులు కర్షకులు — విద్యార్థులు మేధావులు
రైతుకూలీ పేదలంత రణం జేయ నడువాలి -హా-
మనం రకతం చిందే ఏరులై పారినగాని - ఆ
డంకెలోన్ని తరుముదాం ॥లెండిర॥
ఓహో.... ...రైతుకూలీ పేదన్న
ఓహో........కష్టపడే కార్మికన్న

—నిరంజన్

# సినిమాగా "యజ్ఞం" : ఒక సమీక్ష

కాళీపట్నం రామారావు రచించిన "యజ్ఞం" కథను గూర్చిన చర్చ తెలుగు సాహితీ ప్రపంచంలో చాలా లోతుగా, చాలా విస్తృతంగానే జరిగింది. కాళీపట్నం రామారావు రాసిన కథలన్నీ ఒక ఎత్తైతే, 'యజ్ఞం' ఒక్కటే ఒక ఎత్తౌవుతుంది.

'యజ్ఞం' కథమీద వచ్చిన విమర్శల్లో ముఖ్యమైనవి: నవలగా రాయాల్సిన ఇతివృత్తాన్ని కథగా కుదించటం వల్ల అనేక ముఖ్యమైన విషయాల్లో ఈ రచన స్పష్టతను, సమగ్రతను సాధించలేక పోయింది రెండవది, ఈ కథలోని ప్రధాన సమస్య అప్పల్రాముడు గోపన్న దగ్గర నిజంగానే అప్పు తీసుకున్నాడా? లేక గోపన్న అప్పల్రాముణ్ని మోసగించాడా? అటు అప్పల్రాముడి మీద, ఇటు గోపన్న మీద—ఇద్దరిమీదా రచయితకు సానుభూతి ఉన్నట్టు కనిపిస్తుంది. మూడవది: ఈ కథలోని ఒక ముఖ్యమైన పాత్ర శ్రీరాములు నాయుడు. శ్రీరాములు నాయుడును గాంధేయవాదిగానే రచయిత చిత్రించాడా? కథ చివరిదాకా రచయితకు శ్రీరాములు నాయుడి మీద ఎంతో గౌరవం ఉన్నట్టుగానే కనిపిస్తుంది.

ఇక ఈ కథ ముగింపును గూర్చి చాలామంది చాలా రకాలుగా వ్యాఖ్యా నించారు. కథను అతి నాటకీయంగా ముగించటం కోసమే రచయిత సీతారాముడి చేత అతని నాలుగేళ్ళ కొడుకును నరికించేశాడని కొంతమంది భావించారు. కథను అలా ముగించటమే ఎంతో సహజంగా వుందని, ఈ కథను అలా తప్ప మరోలా ముగించే అవకాశమే లేదని అనేకమంది ఈ కథ యొక్క ముగింపును సమర్థించారు.

భారతదేశానికి స్వాతంత్ర్యం వచ్చాక అభివృద్ధి పేరుతో జరిగిన మోసాన్ని చిత్రించటం ఈ కథ యొక్క ప్రధానోద్దేశ్యం. . అయితే ఈ కథలో వున్న కొంత అస్పష్టతకు కారణ మేమిటంటే పాత్రల విషయంలో తను ఎక్కడా ఎవరి పక్షమూ వహించినట్టుగా కనిపించ కూడదని రచయిత ఒక నియమం పెట్టు కున్నాడు. ఈ నియమం మేరకే రచయిత ఈ కథలో తను సృష్టించిన పాత్ర లన్నింటి పట్ల తనకు గౌరవమూ, సానుభూతి వున్నాయన్నట్టుగా కనిపించాడు. తను వాళ్ళు చేసే పనులను గూర్చి చెప్పి తద్వారా పాఠకులనే వాళ్ళు ఎలాంటి వాళ్ళో తేల్చుకొమ్మంటాడు. అలాగే ఎంతో వివరంగా, లోతుగా చిత్రించాల్సిన సమస్యలను రచయిత అలా స్పృశించి వదిలేశాడు:ఇందుకు కారణం ఇది కథలో యిమిడే ఇతివృత్తం కాదు.

ఈ కథను సినిమాగా మలచటం అంత సులభమైన విషయం కాదు. సినిమా కళను గూర్చిన సంపూర్ణమైన అవగాహన ఉన్న దర్శకుడు మాత్రమే ఈ కథకు సినిమా రూపం యివ్వగల్గుతాడు. దురదృష్టవశాత్తు తెలుగు సినిమా రంగంలో అలాంటి దర్శకులెవరూ ప్రస్తుతం కనిపించటం లేదు.

తెలుగు సినిమా రంగానికి వ్యాపార సరళిలో కాకుండా కళాత్మక విలువలతో సినిమాలను నిర్మించే సాంప్రదాయం గొప్పగా లేదు. సినిమాను వ్యాపారంగా కాకుండా కేవలం ఒక కళగా భావించిన తెలుగు దర్శకులు లేనేలేరని చెప్పాలి. బి. యన్. రెడ్డి, కె. వి. రెడ్డి లాంటి దర్శకులు సినిమాను కొంత వ్యాపారం, కొంత కళ అని భావించి సినిమాలు తీశారు. పంతొమ్మిది వందల యాభయ్యో దశకాన్ని తెలుగు సినిమాకు స్వర్ణ యుగం అంటారు కానీ ఈ స్వర్ణయుగంలో కూడా మనకు వ్యాపార లక్ష్యాలను పూర్తిగా వదిలేసిన కళాత్మక చిత్రాలు రాలేదు. అందుకే తెలుగు సినిమా రంగంలో ఒక సత్యజిత్ రే గానీ, ఒక శ్యాం బెనిగల్ గానీ, ఒక అదూర్ గోపాలకృష్ణన్ గానీ, ఒక గిరీష్ కర్నాడ్ గానీ మనకు కనిపించడు. ఇటీవలి కాలంలో నర్సింగరావు కనిపిస్తున్నాడు. సినిమా మీడియమ్‌ను సీరియస్‌గా తీసుకున్న ఏకైక తెలుగు సినిమా దర్శకుడు నర్సింగరావొక్కడే. కానీ నర్సింగ రావుకూడా పైన పేర్కొన్న దర్శకుల సరసన కూర్చోబెట్టాల్సినంత ప్రతిభ లేదు. అతనిలో మంచి సినిమాలు నిర్మించాలన్న తపనైతే వుందిగానీ, అందుకు తగిన నేర్పు అతనిలో సమృద్ధిగా లేదు.

'యజ్ఞం' కథను సినిమాగా రూపొందించిన రామినీడు తెలుగు సినిమా రంగానికి కొత్తవాడేమీ కాదు. "మాయింటి మహలక్ష్మి", "చివరకు మిగిలేది" మొదలైన సినిమాల ద్వారా తెలుగు ప్రేక్షకులకు తెలిసినవాడే. రామినీడు వ్యాపార ఒరవడిలోనే సినిమాలు నిర్మించి, కాస్త మంచి సినిమాలు తీసాడన్న పేరు తెచ్చుకున్నాడు. కానీ సినిమా నొక ఉన్నతమైన కళగా ఆయన భావించిన దాఖలాలు ఇదివరకు ఆయన నిర్మించిన సినిమాల్లో ఎక్కడా కనిపించలేదు. కొంత కాలం తెరమరుగైపోయి మళ్ళీ "యజ్ఞం" సినిమాతో మన ముందుకొచ్చిన రామినీడు ఈ తెర మరుగైపోయిన కాలంలో దర్శకుడుగా ఎంతో ఎదిగి వుంటాడని ఎవరైనా ఆశిస్తే, 'యజ్ఞం' సినిమా చూశాక, ఆ ఆశ అత్యాశేనని అనిపిస్తుంది.

సినిమా దృశ్యకళ. తను చెప్పదల్చుకున్న విషయాన్ని అనేక దృశ్యాల్లోకి ఎలా మార్చాలో దర్శకుడికి తెలియాలి. రచయిత పదాలతో కూడిన వాక్యాల ద్వారా తను చెప్పదల్చుకున్నది చెబుతాడు. దర్శకుడు ఆ పదాలను దృశ్యాల్లోకి అనువదించాలి. సినిమాలో డైలాగులు, మ్యూజిక్ మొదలైనవి దృశ్యాల్లో భాగాలు గానే వుండిపోవాలి తప్ప, అవ్వే డామినేట్ చెయ్యకూడదు. చాలా మంది సినిమా దర్శకులు సినిమా అంటే నాటకం యొక్క ఆధునిక రూపమనే అనుకుంటారు. అందుకే మన సినిమాల్లో దృశ్యాలకంటే శబ్దాలకు ఎక్కువ ప్రాముఖ్యం యివ్వ బడ్తుంది మన సినిమాల నిండా సుదీర్ఘమైన సంభాషణలు, పాటలు, చెవులను బ్రద్దలు కొట్టే నేపథ్య సంగీతం మొదలైనవన్నీ వుంటాయి. సినిమా కళ, నాటక

కళ-రెండూ స్వతంత్రంగా వేర్వేరు కళలు. దేనికుండే కళా నియమాలు దానికున్నాయి. సినిమా కళను గూర్చిన ఇలాంటి కొన్ని ప్రాథమిక సూత్రాలను గమనించక పోవటం వల్లనే, 'యజ్ఞం' కథను సెల్యులాయిడ్‌లోకి అనువదించటంలో రామినీడు విఫలమైపోయాడు.

దర్శకుడు సినిమా కోసమే ఒక కథను రూపొందించుకొని, దాన్ని సినిమాగా మలచటం కంటే, ఇదివరకే సాహిత్యంలో స్థిరపడి పేరు ప్రఖ్యాతులు పొందిన కథను ఎన్నుకొని, సినిమాగా మలచటం ఎక్కువ కష్టం-తన సినిమాకు ఆధారమైన ఒరిజినల్ స్టోరీకి తాను ఎంతవరకు విధేయుడై వుండగలడు అన్నది తేల్చుకోవటం, ప్రతి దర్శకునికి కొన్ని ఇబ్బందికరమైన సమస్యల్ని సృష్టిస్తుంది. తన కథకు నూటికి నూరుపాళ్ళ దర్శకుడు విధేయుడై వుండాలని రచయిత ఆశిస్తాడు. కానీ సినిమాకోసం కథలో కొన్ని మార్పులు చెయ్యక తప్పదని దర్శకుడనుకుంటాడు. ఒరిజినల్ కథలో రచయిత సృష్టించిన వాతావరణాన్ని గానీ, పాత్రల్నిగానీ, చెప్ప దల్చుకున్న విషయాన్ని గానీ మార్చకుండా సినిమా కళకున్న కొన్ని ప్రత్యేక సదుపాయాలను దృష్టిలో పెట్టుకొని, కొన్ని సన్నివేశాలను తీసెయ్యటం గానీ లేదా చేర్చటంగానీ దర్శకుడు చెయ్యవచ్చునని, ఆ విధంగా ఒరిజినల్లో కొన్ని మార్పుల్ని చేసే అవకాశం దర్శకుడి కుండాలని ఇవ్వాళ అటు సాహిత్య విమర్శకులు, ఇటు సినిమా విమర్శకులు అంగీకరిస్తున్నారు. ఆ విధంగా దర్శకుడు రామినీడు యజ్ఞం' కథను సినిమాగా అనువదించినప్పుడు సినిమాలో కొన్ని మార్పులు, చేర్పులు చేశాడు. అందుకాయన్ను తప్పు పట్టటంలేదు-అయితే ఈ మార్పులు, చేర్పుల వల్ల సినిమా నాణ్యత పెరిగిందా? లేదా? అన్న విషయమే ప్రధానమౌతుంది.

'యజ్ఞం' కథ అప్పల్రాముడు గోపన్నకు చెల్లించాలని చెప్పబడుతున్న అప్పును గూర్చి తేల్చటానికి జరుపబడుతున్న పంచాయితీతో ప్రారంభమై మిగతా కథంతా ఫ్లాష్‌బాక్‌లో చెప్పబడుతుంది. 'యజ్ఞం' సినిమాను కూడా ఇలాగే ప్రారం భించటంలో నష్టమేమీ లేదు. దర్శకుడు రచయిత అనుసరించిన ఈ కథా కథన పద్ధతిని ఎన్నుకోకుండా తనదైన స్వంత పద్ధతిని ఎన్నుకున్నాడు. కథను ఫ్లాష్ బాక్‌లో చెప్పకుండా ముప్పై సంవత్సరాలు వెనక్కి వెళ్ళి, అక్కడ్నించి ప్రారంభించాడు. ఇందుకూడా దర్శకుడ్ని తప్పు పట్టటం లేదు- కానీ 'యజ్ఞం' సినిమాను ఇప్పుడొస్తున్న వ్యాపార సినిమాల్లాగ చాలా వేగంగా, అతి నాటకీయంగా నడిపించాలని ప్రయత్నించటమే ఈ దర్శకుడు చేసిన పెద్ద పొరపాటు. సినిమాను చాలా వేగంగా నడిపించాలన్న ప్రయత్నం కారణంగానే సినిమా ప్రారంభంలో చూపించబడిన దృశ్యాలన్నీ చాలా అస్తవ్యస్తంగా, కలగాపులగంగా, గందరగోళంగా తయారయ్యాయి. ఉదాహరణకు - సినిమా ప్రారంభంలో ఇద్దరు జమీందార్లు

ఒకప్ప్రాకరు పొడిచేసుకుంటారు. ఈ దృశ్యానికి అసలు కథకు సంబంధమేమిటి? ఇంతలోనే అకస్మాత్తుగా యుద్ధ విమానాలు, బాంబులు, హిట్లర్ కనిపిస్తారు. రెండో ప్రపంచ యుద్ధం ప్రారంభమైంది అని సూచించటం కోసం ఈ దృశ్యాలను మెయిన్ సినిమాలో అతికించారు. రెండవ ప్రపంచయుద్ధం తర్వాత వ్యవసాయ రంగంలో వచ్చిన మార్పులను—ముఖ్యంగా రైతులు తిండి గింజలను పండించటం తగ్గించి వాణిజ్య పంటలను పండించటం మొదలెట్టారనే విషయాన్ని చెప్పటం కోసం ఈ సినిమాలో రెండవ ప్రపంచ యుద్ధానికి సంబంధించిన దృశ్యాలను చూపించారు. కానీ ఒక సమర్థుడైన దర్శకుడైతే ఈ విషయాన్నెంతో జాగ్రత్తగా, కళాత్మకంగా చూపించేవాడు.

అప్పల్రాముడి దగ్గరకు గోపన్న రావటం, అప్పల్రాముడు పండిస్తున్న పంటను తనకే అమ్మాలని ఒప్పించటం—అంటే రచయిత రాసిన అసలు 'యజ్ఞం' కథ ప్రారంభమయ్యాకే సినిమా ఓ గాడిలో పడ్తుంది. అంతకు ముందు దర్శకుడు తన స్వంత తెలివితేటలు ఉపయోగించి చేర్చిన దృశ్యాలన్నీ చాలా అస్తవ్యస్తంగా, గోలగా వున్నాయే తప్ప, వాటిల్లో కొంచెం కూడా సినిమా కళలోని మెలకువలు లేవు.

అప్పల్రాముడు గోపన్నకు యే విధంగా అప్పు పడ్డాడో సినిమాలో చూపించ బడలేదు. అయితే ఇందుకు దర్శకుడ్ని నిందించి ప్రయోజనం లేదు. ఎందుకంటే ఈ లోపం కథలోనే వుంది. కథలో అప్పల్రాముడు గోపన్నకు యేవిధంగా అప్పుపడ్డాడో స్పష్టంగా చెప్పబడలేదు. కథలోని ఈ అస్పష్టత మీద చర్చ జరిగిం దనుకోండి. రచయిత కథకు అత్యంత ప్రాణప్రదమైన ఈ అంశాన్ని ఎందుకలా అస్పష్టంగా వదిలేశాడో చెప్పటానికక్కడ అవకాశం లేదు. కాని దర్శకుడు ఈ విషయంలో కొంచెం జాగ్రత్త పడాల్సింది. గోపన్న అప్పల్రాముణ్ని ఈ విష యంలో ఎలా మోసం చేశాడో ఇంకా స్పష్టంగా, పటిష్టంగా దర్శకుడు చూపించి వుంటే, అప్పల్రాముడి మీద ప్రేక్షకుల సానుభూతి యింకా పెరిగేది.

అప్పల్రాముడి కొడుకు సీతారాముడు పాత్ర కథలో చిన్నదే-సినిమాలో ఈ పాత్రను దర్శకుడు పెంచాడు. పెంచటంలో తప్పేమీలేదు. సీతారాముడి పాత్రను పెంచి నిర్మించిన దృశ్యాలన్నీ ఫరవాలేదనిపించాయి.

కథలో చాలా ముఖ్యమైన పాత్ర శ్రీరాములు నాయుడు. ఈ పాత్ర సినిమాలోయింకా నిర్దిష్టంగా, యింకా బలంగా రూపొంద వలసింది.

'యజ్ఞం' కథ క్లైమాక్స్‌ను గురించి కూడా చాలా చర్చ జరిగింది. కేవలం నాటకీయత కోసమే రచయిత కథలో సీతారాముడు తన నాలుగేళ్ళ కొడుకును నరికేసి గోనెసంచిలో వేసుకొని పంచాయితి జరుపుతున్న పెద్ద మనుషుల ముందు

పదేయించాడని విమర్శించిన వాళ్ళున్నారు. ఈ కథకు ఈ క్లైమాక్స్ చాలా సహజంగా వుందన్న వాళ్ళూ వున్నారు. శ్రీరాములు నాయుడు "అభివృద్ధి" పేరుతో ఆ ఊరిలో నిర్వహించిన "యజ్ఞం", ఎలా విఫలమైపోయిందో, ఆ 'యజ్ఞాని'కి ఆ వూరి హరిజనులను ఎలా బలిపశువులుగా వాడుకున్నారో చూపించటమే, ఈ కథ లక్ష్యం కాబట్టి, కథకు ఈ క్లైమాక్స్ సహజంగానే వుందని వాదించటానికి అవకాశం వుంది. అయితే ఈ క్లైమాక్స్‌ను సినిమాలో చిత్రించిన పద్ధతి మాత్రం సహజంగా లేదు. మొదలే నాటకీయతతో కూడిన ఈ సన్నివేశాన్ని దర్శకుడు అతి నాటకీయం చేసేశాడు.

ఈ ముగింపు దృశ్యాన్ని చిత్రించినప్పుడు ఈనాటి వ్యాపార సినిమాల్లో లాగా పెద్ద రొదలాంటి ఆ నేపథ్య సంగీతమేమిటి? అకస్మాత్తుగా ఆ వర్షమేమిటి? అన్ని కర్ణ కఠోరమైన శబ్దాలతో సాధించలేని ప్రయోజనాన్ని, ప్రభావాన్ని దర్శకుడు నిశ్శబ్దంగా ఈ దృశ్యాలను చిత్రీకరించటం ద్వారా సాధించగల్గేవాడు. సీతారాముడు హరిజన వాడ వైపు వెళ్ళగానే అక్కడున్న అందరూ ఏం జరుగుతుందోనని ఆతురతగా ఎదురు చూడటం....ఈ దృశ్యాన్ని ఏ నేపథ్య సంగీతం లేకుండానే అక్కడున్న వాళ్ళందరి ముఖాల్లోని ఆందోళనను క్లోజప్స్‌లో చూపించటం ద్వారాచిత్రీకరించవచ్చు. అలాగే సీతారాముడు హరిజన వాడకు వెళ్ళి, తన కొడుకును నరికేసిన దృశ్యాన్ని కూడా ఎలాంటి హై సౌండ్స్ లేకుండా....నిశ్శబ్దంగా కావాలంటే నాచురల్ సౌండ్స్‌ని వుపయోగించుకొని చిత్రించి వుంటే, ఎక్కువ ప్రభావవంతంగా వుండేది. సీతారాముడు గోనెసంచితో పెద్దమనుషుల మధ్యలో కొచ్చాక, పెద్ద వర్షం పడుతున్నట్టుగా చూపించటం వల్ల, చిత్రం స్థాయి దిగజారి పోయింది.

'యజ్ఞం' కథను సెల్యులాయిడ్‌లోకి మార్చాలనుకున్న వాళ్ళెవరైనా లాభాల మీద ఆశ వదలుకునే అపని చెయ్యాలి. కళాత్మకంగా తప్ప మరోరకంగా ఈ కథను తెరకెక్కించటాని కవకాశం లేదు. అతి నాటకీయత, వేగం, హై సౌండింగ్ బ్యాక్‌గ్రౌండ్ మ్యూజిక్ మొదలైన వ్యాపార సినిమాల పద్ధతుల్ని 'యజ్ఞం' సినిమాలో జొప్పించటం ద్వారా కళాత్మక విలువలున్న సినిమా నిర్మించామన్న పేరుతో బాటు, నాలుగురాళ్ళు కూడా సంపాదించ వచ్చునని దర్శకుడు ఆశించాడు. ఈ కారణం వల్లనే 'యజ్ఞం' ఒక స్వచ్ఛమైన కళాత్మక సినిమాగా రూపొందలేక పోయింది. అలాగే నాలుగురాళ్ళు సంపాదించగల్గే వ్యాపార సినిమా కూడా కాలేకపోయింది.

ఈ సినిమాను కొంత వరకైనా రక్షించ గల్గిన అంశమేమిటంటే

(తరువాయి 42 వ పేజీ)

# ఏబావిలన్న పడి - పాణమిడిసిన మేలు

అక్కో మీరింటరి నా బావ - అక్కో మీరింటరి నాయతలు
సాలువాని హనుమక్క - బ్యాగరి బాలక్క
తలారి రాముక్క - టంగెళ్ళ లస్మక్క - ॥అక్కో॥

ఎవ్వని సోపతిపట్టి - ఎట్ల మరిగె నోకాని
సుక్కలేంది ఒక్క - దినమయిన ఉండడే
వాటంగ తాగుతాడు -- వలుగుబెడి పండుతడు
పూట లిండియూళయితే - గుడిసెకు చేరుతడు
చేసేది లేపాయె - శేపేది లేపాయె
తెచ్చిపెట్టకుంటె - సచ్చేదెబ్బలు కొట్టె
మొగపని ఆడిపని - రెండు నేనేచేసి
సెక్కపేలికోలే - ఎండి సిక్కితి గదనే
ఈ తాగుబోతోని తోని - తండ్లపడెకన్న
ఏ బావిలన్న పడి - పాణ మిడిసిన మేలు ॥అక్కో॥

అక్కో, ఆ అయ్య ఈ అయ్య - కాళ్ళు ఏళ్ళు మొక్కి
అదునయిన సెలుకలో - ఆరుక - దున్నిస్తిని
మట్టిలో మన్నె సెలుక - పొతము చేసి
సంటి పిల్లలోలే - పంట మొక్కల సాది
కావలుండి దొంగ - పసుల నెల్లగొట్టి
కాపు కొచ్చిన దాక — సేను భద్రం చేస్తి
సేసిన సెమట ఫల — మేటిపాలు చెయ్య
సుట్టు మబ్బులు కమ్మి - వాన మొగులవుతుంటే
కాత నిండిన కంకి - కోసి కుప్పేయమంటె
కైపెక్క సారా తాగి - కళ్ళుముల పండుకునె
తెప్పల్ల ఉరుమురిమి - దొల్లొచ్చెలెమ్మంటె
సెప్పుడిసిరాని సెప్ప - రాని దెబ్బలు కొట్టె
వాన జల్లుకు తడిసి - కంకి మక్కిపాయె
నా కన్న సంతుకు - కడుపు మంటలు మిగిలె; ॥అక్కో॥

వాయిదాలకమ్మె - బంగోలు వంద రెడ్లు
ఊళ్ళకొస్తే పాట - పాడి రానురాచ్చిండు
మామ! ఒన్నొక్క గుడ్డసు - దూల్లాతో దున్నషూ
ఉద్దెర పెట్టి ఎడ్లు — ఎందుకని అడిగితే

గుత్తసెలుకలు దున్ని - బండిబాడుగకొట్టి
ఆరునెల్లకు అప్పు - సుస్త చేస్తని చెప్పె
వలుగు చెడ్డ పనులు - ఎన్నటికీ సెయ్యనని
వొట్టు పెట్టుక సారా - సుక్క ముట్టనని
నమ్మిచ్చి నాసెవుల - గెంటీలు వదిలిచ్చె
అమ్మిపేకు ఇరుసు - బండి కొంటనిపాయె
పొయ్యినోడు పొయ్యినట్టె - నెల మళ్ళీ సూడలే
అమురుదాగుతు - మళ్ళ కొత్తప్పుసేసిండు
కండి బట్టలేదు - బాడుగ రాలేదు
గుత్తదున్నిన సెలుకలి - (వి)త్తనాల్లెలలే
బండి కొన్నొడ్ల - ఎండి బొక్కలు తేలే
బాకీ ముజ్జీతోకల్లా - కిస్తులోడువాలే
అప్పు కట్టకపోతే - అడుగు తీయనండు
ఆలీనమ్మిన అప్పు — కట్టమని కూసుండు ॥అకో॥

మా యారాలు తల్లింట్ల - కార్యముందని సెప్పి
ఇంటికి పెద్దోళ్ళని - ద్దరిని రమ్మంటె
ఈయనెంటబోతే - ఏడ ఏమౌతదని
అగులు బుగులుతోనే - వాళ్ళింటి కికోయితిని
ఇంటన్లున్నని - ఇంత జాము చేస్తే
దీరుల సారా కలిపి - వార పట్టిండక్క
చుట్టాల ముందర - ముందెనుక సూడక
మళ్ళదొరకదని - పుల్లుగ నింపిండు

---

(40 వ పేజీ తరువాయి)

అప్పుల్రాముడుగా పి.యల్. నారాయణ, సీతారాముడుగా భానూచందర్ ఆ పాత్రలకు పూర్తి న్యాయం చెయ్యటం.

సినిమా పూర్తయి పోయిన తర్వాత తను ఈ సినిమా ద్వారా చెప్ప దల్చుకున్న విషయం ప్రేక్షకులకు అర్థమయిందో లేదోనన్న అనుమానం దర్శకుడికి కల్గినట్టుంది. అందుకే నేపథ్యంలోంచి ఒక ఉపన్యాసం వినిపించాడు. సినిమా అయిపోయిందని లేచి బయటకు వెళుతున్న ప్రేక్షకులు ఈ ఉపన్యాసం వింటూ దర్శకుడిమీద జాలి పడ్తారు. ఎందుకంటే తను చెప్పదల్చుకున్న విషయాన్ని చెప్పలేక పోయానని దర్శకుడే ఒప్పుకున్నాడు.

—నవీన్

కోడి భగాలొండి — తినమని సిళ్ళస్తే
నీళ్ళ సెంబును — రోలు బండకు కొట్టిండు
సోలుతు తూలుతూ — తలెసుండు పాసోని
సేత్తో కలిపె బదులు — కాలుతో కలిపిండు
నోటి కందుత లేదని — తీటలొర్లిచేసె
సిన్నాళ్ల ముంగల — సిగ్గుశరము పాయె ॥అక్కో॥

పీర్ల పండుగనాడు — ఊళ్ళె మందిల కురికి
దూల ఆడుతనని — గోల గోల రేపె
సోర్ర దుడ్డె లంత — జోరు గాడుతుంటె
తాగి, క్రైపుతోవాళ్ళ — కాళ్ళ సందులకురికె
అడ్డదిడ్డము దుంకి — దుడ్డెల కిందేసే
ఆడిపాడకుండ — అల్వంతో కొట్లాడే
వరుస వాయి తప్పి - మురికి కూతలు కూస్తే
బడితె తీసుక యాపు - నిరుగ మరుగేసింద్రు
మా అయ్యను, కొట్టిరని — పిల్లలేడుస్తుంటె
నా మనసు కరిగి — కంటినీరు చెరువయి పారె ॥అక్కో॥

జొన్న కొయ్యల్లోని — జొర్రీగల గడ్డి
గెనుపురుసుకొని బలిసి — సెలుకంత పెరిగింది
కాయగుత్తులు వట్టిన — కందిపట్టెల సాలు
కాపుగాసితే రెండు — తూములన్న ఎలుతుండే
గొర్లు మేకలు పసుల — గుంపుల నదిలిచ్చి
కావలున్నండి భద్రం — సెయ్యిమామంటే
గొల్లకురువొల్లతో — సారా కప్పులుతాగి
నోటికాడి పేను - లూరీడిసి వచ్చిండు ॥అక్కో॥

ఇంట్ల దీపము బుడ్ల - సమురుకేడిస్తే
సారా పాకెట్ తెమ్మని — సాదించి సంపుతడు
సాట బత్తెపు బదులు — పూట పూటకుచేసి
సంటి పిల్లల నెంత — దాక నే సాకాలి
ఒన్న దూడుసుక పాయె — ఇల్లు బత్తెలాయె
పది మందిల బ్రతుకు - పల్చదనామాయె
పది మందిల బతుకు — పల్చదనామాయె ॥అక్కో॥

వెంకన్న

వ్యంగ్యం :

# గోవిందం - భజ గోవిందం

— యం. కృష్ణారావు

"మొత్తానికి ఈ దెబ్బతో అశేష ఆంధ్రలోక ప్రజానీకానికి సారా అంటే ఇష్టమని తేలిపోయింది" అన్నాడు భజగోవిందం.

"అదెలాగ! తప్పు మాట్లాడక. కొన్ని నెలలుగా ప్రజలందా 'సారా మా కొద్దు బాబోయ్' అని గొంతెత్తి అరుస్తుంటే, నువ్వు అలా అంటావేమిటి?" అన్నాడు భజగోవిందం.

"అదే కాదు. ఈ దెబ్బతో డిస్టిలరీలను కూడా ఏర్పాటు చేసుకోవచ్చని ప్రజలంతా ఆమోదముద్ర వేసేసారు."

"అన్యాయం! అక్రమం! నువ్వు ప్రజల్ని అవమానిస్తున్నావు" అని మళ్ళీ ఆవేశంగా అన్నాడు భజ గోవిందం.

"అంతే కాదోయి. ఇక నిత్యావసర ధరలు, బస్సు, రైళ్ళ టికెట్ల ధరలు అన్నీ పెరగటం సమంజసమేనని, లాటరీలను కూడా నిషేధించాల్సిన అవసరం లేదని, కొడుకులకి, కూతుళ్ళకి, అల్లుళ్ళకి నియమాల్ని అతిక్రమించి లైసెన్సులవీ మంజూరు చేసుకోవచ్చని ప్రజలంతా ఏకగ్రీవంగా ఆమోదించేసేరు."

"నువ్వంతా తిరగేసి మాట్లాడుతున్నావ్. నీ పళ్ళు మరెక్కడో వున్నట్టున్నాయి" కోపంగా అన్నాడు భజ గోవిందం.

"ఓరి వెర్రినాయనా! అంతేకాదు. కేంద్రంలో నరసింగంగారి 'నూతన ఆర్థిక విధానం' మార్కు పాలన అద్భుతంగా వుందని కూడా ప్రజలు సర్టిఫికేట్ ఇచ్చేసారు" అని కూల్‌గా అన్నాడు గోవిందం.

"ఓరీ కాంగీ పక్షపాతి! నిన్ను నిలువునా పాతినా తప్పు లేదు. ప్రజలంతా వ్యతిరేకిస్తున్నవాటినన్నిటిని వాళ్ళకే అంటగడతావేం?" అని ఉగ్రుడయిపోయాడు భజ గోవిందం.

"నాయనా భగో! ఆవేశపడక. ఇవన్నీ నేనన్నవి కావు. సాక్షాత్తు మన ముఖ్యమంత్రిగారే సెలవిచ్చారు."

"ఏమిటో అంత కండ కావరం."

"మరి ఆయన పాణ్యంలో గెలిచాడు కదా! అంటే ప్రజలంతా వీరి పరిపాలన అద్భుతంగా వుందనే ఓట్లేసి గెలిపించారట."

"ఏమిటీ ? రిగ్గింగ్ చేసి గెలిచేస్తే ఈయనగారి పరిపాలన మహా బాగా వున్నట్టా? ఆయన గెలిచింది ఒక నియోజకవర్గంలోనేగాని రాష్ట్రమంతా కాదుకదా?' అని కోపోద్రుడయి ప్రశ్నించాడు భగో. (తరువాయి 49 పేజీ)

# పిల్లల ప్రపంచం

పిల్లలూ-

మనకింకో కొత్త స్నేహితురాలు దొరికింది. అందే ఎక్కడో తప్పిపోయి దొరకటం కాదు సుమా. తన పేరు 'లహరి'. అయిదో తరగతి చదువుతోంది. తను రాసిన ఉత్తరాన్ని ఇక్కడ ఇస్తున్నాను. మీరందరూ చదవండి. మీరు కూడా మీ స్నేహితులకి, మీ బంధువులకీ, ఇంకా మన పిల్లలు ప్రపంచానికి ఉత్తరాలు రాయండి. వాటిని అందరికీ పరిచయం చేద్దాం. సరేనా-

మీ
మామయ్య

డియర్ అంకుల్,

మీకు 'లహరి' నమస్కారములు. మీరు వ్రాసిన 'మా హృదయం' పుస్తకం చాలా బావుంది. ఆ పుస్తకం నాకు తాతా రమేష్‌బాబు ఇచ్చారు. అందులో నాకు 'వెన్నెల' చాలా బావుంది. అది చదువుతుంటే 'వెన్నెల'తో ఆడుకున్నట్లే ఉంది. మీకులాగానే నాకు కూడా వెన్నెల్ల రాత్రి చెరువు గట్టున ఆడుకోవాలనిపిస్తుంది. కానీ మా ఊళ్ళో చెరువు లేదు. మీరు వ్రాసినట్లుగా నేను గవర్నమెంటు స్కూలులో చదవటం లేదు. నేను ప్రయివేటు స్కూలు లో చదువుతున్నాను. మా స్కూలులో ఏడవ తరగతివరకూ ఉంది. నేను ఐదవ తరగతి చదువుతున్నాను. అన్ని స్కూళ్ళలో లోనేమో అప్పుడే హాలిడే స్కూళ్ళు పెట్టేస్తున్నారు. కానీ మాకు ఇంకా పెట్ట లేదు.

మా నాన్నగారు 'గుడివాడ'లో జాబ్ చేస్తున్నారు. నాకు ఒక ఊరి నుంచి ఇంకో ఊరికి మా నాన్నగారికి ట్రాన్స్‌ఫర్ చేస్తే బావుండుననిపిస్తుంది. కొత్త కొత్త ఊర్లు చూడాలని ఉంటుంది. కానీ మా నాన్నకు ట్రాన్స్‌ఫర్ రాదని అమ్మ చెప్పింది. మా అమ్మ, అక్క, నేను జంక్షన్‌లో ఉంటున్నాం. మేం చదివే కాన్వెంట్‌లో ప్రిన్సిపాల్ మా అమ్మే. ఉగాది నాడు మా స్కూల్లో తాతా రామేష్‌గారు పప్పెట్‌షో ప్రదర్శించారు. మీకు లెటర్ రాస్తే రిప్లయ్ ఇస్తారని ఆయనే చెప్పారు.

నాకు మీలాగా కథలు, పాటలు రాయాలని ఉంటుంది. ఎప్పుడైనా వ్రాస్తూ ఉంటాను గానీ, వాటిని దేనికైనా పంపించమని అంటే మా అమ్మ అసలు పంపిం చటం లేదు. 'రాజమండ్రి'లో మాకు చుట్టాలు ఉన్నారు కాబట్టి మేం గోదావరి నదిని చాలాసార్లు చూశాము. కానీ కృష్ణానదిని మాత్రము చూడలేదు. మమ్మల్ని ఎప్పుడు తీసుకువెళ్ళమన్నా ఈసారి సెలవులకు అంటున్నారు. ఎన్ని సెలవులు వెళ్ళిపోయినా మమ్మల్ని మాత్రం తీసుకువెళ్ళటం లేదు. మీరు కాస్త చెప్పండి.

ఇట్లు. — లహరి

నిర్వహణ : పి. చంద్రశేఖర్ ఆజాద్, ఏలూరు.

వ్యంగ్యం :

# గోవిందం - భజ గోవిందం

— యం. కృష్ణారావు

"మొత్తానికి ఈ దెబ్బతో అశేష ఆంధ్రలోక ప్రజానీకానికి సారా అంటే ఇష్టమని తేలిపోయింది" అన్నాడు భజగోవిందం.

"అదెలాగ! తప్పు మాట్లాడక. కొన్ని నెలలుగా ప్రజలందా 'సారా మా కొద్దు బాబోయ్' అని గొంతెత్తి అరుస్తుంటే, నువ్వు అలా అంటావేమిటి?" అన్నాడు భజగోవిందం.

"అదే కాదు. ఈ దెబ్బతో డిస్టిలరీలను కూడా ఏర్పాటు చేసుకోవచ్చని ప్రజలంతా ఆమోదముద్ర వేసేసారు."

"అన్యాయం! అక్రమం! నువ్వు ప్రజల్ని అవమానిస్తున్నావు" అని మళ్ళీ ఆవేశంగా అన్నాడు భజ గోవిందం.

"అంతే కాదోయి. ఇక నిత్యావసర ధరలు, బస్సు, రైళ్ళ టిక్కెట్ల ధరలు అన్నీ పెరగటం సమంజసమేనని, లాటరీలను కూడా నిషేధించాల్సిన అవసరం లేదని, కొడుకులకి, కూతుళ్ళకి, అల్లుళ్ళకి నియమాల్ని అతిక్రమించి లైసెన్సులవీ మంజూరు చేసుకోవచ్చని ప్రజలంతా ఏకగ్రీవంగా ఆమోదించేసేరు."

"నువ్వంతా తిరగేసి మాట్లాడుతున్నావ్. నీ పళ్ళు మరెక్కడో వున్నట్టున్నాయి" కోపంగా అన్నాడు భజ గోవిందం.

"ఓరి వెర్రినాయనా! అంతేకాదు. కేంద్రంలో నరసింగంగారి 'నూతన ఆర్థిక విధానం' మార్కు పాలన అద్భుతంగా వుందని కూడా ప్రజలు సర్టిఫికేట్ ఇచ్చేసారు" అని కూల్‌గా అన్నాడు గోవిందం.

"ఓరీ కాంగీ పక్షపాతి! నిన్ను నిలువునా పాతినా తప్పు లేదు. ప్రజలంతా వ్యతిరేకిస్తున్నవాటినన్నిటిని వాళ్ళకే అంటగడతావేం?" అని ఉగ్రుడయిపోయాడు భజ గోవిందం.

"నాయనా భగో! ఆవేశపడక. ఇవన్నీ నేనన్నవి కావు. సాక్షాత్తు మన ముఖ్యమంత్రిగారే సెలవిచ్చారు."

"ఏమిటో అంత కండ కావరం."

"మరి ఆయన పాణ్యంలో గెలిచాడు కదా! అంటే ప్రజలంతా వీరి పరిపాలన అద్భుతంగా వుందనే ఓట్లేసి గెలిపించారట."

"ఏమిటీ ? రిగ్గింగ్ చేసి గెలిచేస్తే ఈయనగారి పరిపాలన మహా బాగా వున్నట్టా? ఆయన గెలిచింది ఒక నియోజకవర్గంనోనేగాని రాష్ట్రమంతా కాదుకదా?" అని కోపోగ్రుడయి ప్రశ్నించాడు భగో. (తరువాయి 49 పేజీ)

## పిల్లల ప్రపంచం

పిల్లలూ-

మనకింకో కొత్త స్నేహితురాలు దొరికింది. అంటే ఎక్కడో తప్పిపోయి దొరకటం కాదు సుమా. తన పేరు 'లహరి'. అయిదో తరగతి చదువుతోంది. తను రాసిన ఉత్తరాన్ని ఇక్కడ ఇస్తున్నాను. మీరందరూ చదవండి. మీరు కూడా మీ స్నేహితులకి, మీ బంధువులకీ, ఇంకా మన పిల్లలు ప్రపంచానికి ఉత్తరాలు రాయండి. వాటిని అందరికీ పరిచయం చేద్దాం. సరేనా-

మీ

మామయ్య

డియర్ అంకుల్,

మీకు 'లహరి' నమస్కారములు. మీరు వ్రాసిన 'మా హృదయం' పుస్తకం చాలా బావుంది. ఆ పుస్తకం నాకు తాతా రమేష్‌బాబు ఇచ్చారు. అందులో నాకు 'వెన్నెల' చాలా బావుంది. అది చదువుతుంటే 'వెన్నెల'తో ఆడుకున్నట్లే ఉంది. మీకులాగానే నాకు కూడా వెన్నెల రాత్రి చెరువు గట్టున ఆడుకోవాలనిపిస్తుంది. కానీ మా ఊళ్ళో చెరువు లేదు. మీరు వ్రాసినట్లుగా నేను గవర్నమెంటు స్కూలులో చదవటం లేదు. నేను ప్రయివేటు స్కూలు లో చదువుతున్నాను. మా స్కూలులో ఏడవ తరగతివరకూ ఉంది. నేను ఐదవ తరగతి చదువుతున్నాను. అన్ని స్కూళ్ళలో లోనేమో అప్పుడే హాలిడే స్కూళ్ళు పెట్టేస్తున్నారు. కానీ మాకు ఇంకా పెట్ట లేదు.

మా నాన్నగారు 'గుడివాడ'లో జాబ్ చేస్తున్నారు. నాకు ఒక ఊరి నుంచి ఇంకో ఊరికి మా నాన్నగారికి ట్రాన్స్‌ఫర్ చేస్తే బావుండుననిపిస్తుంది. కొత్త కొత్త ఊర్లు చూడాలని ఉంటుంది. కానీ మా నాన్నకు ట్రాన్స్‌ఫర్ రాదని అమ్మ చెప్పింది. మా అమ్మ, అక్క, నేను జంక్షన్‌లో ఉంటున్నాం. మేం చదివే కాన్వెంట్‌లో ప్రిన్సిపాల్ మా అమ్మే. ఉగాది నాడు మా స్కూల్లో తాతా రామేష్‌గారు పప్పెట్‌షో ప్రదర్శించారు. మీకు లెటర్ రాస్తే రిప్లయ్ ఇస్తారని ఆయనే చెప్పారు.

నాకు మీలాగా కథలు, పాటలు రాయాలని ఉంటుంది. ఎప్పుడైనా వ్రాస్తూ ఉంటాను గానీ, వాటిని దేనికైనా పంపించమని అంటే మా అమ్మ అసలు పంపిం చటం లేదు. 'రాజమండ్రి'లో మాకు చుట్టాలు ఉన్నారు కాబట్టి మేం గోదావరి నదిని చాలాసార్లు చూశాము. కానీ కృష్ణానదిని మాత్రము చూడలేదు. మమ్మల్ని ఎప్పుడు తీసుకువెళ్ళమన్నా ఈసారి సెలవులకు అంటున్నారు. ఎన్ని సెలవులు వెళ్ళిపోయినా మమ్మల్ని మాత్రం తీసుకువెళ్ళటం లేదు. మీరు కాస్త చెప్పండి.

ఇట్లు. — లహరి

నిర్వహణ : పి. చంద్రశేఖర్ ఆజాద్, ఏలూరు.

## పెద్దల కోసం

లహరి రాసిన ఉత్తరం చదివారు కదా. నేను మరచిపోలేని ఉత్తరాలలో అది ఒకటి. నా 'పుస్తకం' గురించి చెప్పటానికి ఇది ప్రచురించలేదు. ఈ లేఖ ఒక్కసారిగా నన్ను బాల్యంలోకి తీసుకు వెళ్ళింది. ఒంటి పూట బడి రెండు రోజులు ఆలస్యంగా పెడితే మాకు చాలా అన్యాయంగా అనిపించేది.

ఈ లేఖ ఎంత సాధారణంగా కనిపిస్తుందో అంత అసాధారణమైన లేఖ ఇందులో కోట్లాది మంది పిల్లలు హృదయం ఉంది. మళ్ళీ చదవండి. పిల్లలకి ఈ ప్రపంచాన్ని చూడాలనే ఆరాటం ఉంటుంది. అందుకోసం తన నాన్నగారికి బదిలీ కావాలని కోరుకుంటోంది. అంతేకాదు. తమ జీవనదుల్ని దర్శించి ఆనందం పొందాలనుకుంటున్నది ఆ పాప.

లహరి మాత్రమే కాదు. ఎందరెందరో పిల్లలకు అలాంటి కోర్కెలున్నాయి. ఆర్థికంగా అవకాశం లేనివారిని అలా ఉంచండి. అలాంటి అవకాశాలున్నవారు తమ బిడ్డల కోసం ఓ గంట కేటాయించి, వారి ఆలోచనలు తెలుసుకోగలుగుతున్నారా? వారి కోర్కెలు- కనీసమైనవి- తీర్చేటందుకు ఉత్సాహం చూపిస్తున్నారా? ఎవరికి వారు తమను తాము ప్రశ్నించుకోవలసిన అవసరం ఉంది.

చివరిగా నన్ను బాధకు లోను చేసిన విషయం ఒకటుంది. 'తను కథలు రాసినా ఎవరికీ పంపించటం లేదు' అని చెబుతోంది తను. అందుకు తల్లిదండ్రుల కుండే భయాలూ, ఇతర కారణాలు ఏమైనా ఇలాంటి నిరాదరణ పిల్లల్లో ప్రశ్నించే శక్తినీ, సృజనాత్మకతనూ ధ్వంసం చేస్తాయనీ గుర్తించవలసిందిగా కోరుతున్నాను.

తను చూస్తున్న ప్రపంచాన్ని ఏదో ప్రక్రియ ద్వారా పిల్లలు తిరిగి ప్రతిబింబిస్తారు. కవిత్వం, కథ, చిత్రలేఖనం, సంగీతం, గానం, ఇలాంటి లలిత కళలు వారిని ఉన్నత పరుస్తాయి తప్పించి పాడు చేయవు.

సరిగ్గా ఇలాంటి అభిరుచులు లేకపోవటమే పిల్లలనూ, పెద్దవారిని కూడా పాడు చేయగలవు.

## పదండి పోదాం – పదండి చూద్దాం

అందుకే ఈ శెలవుల్లో మీమీ పిల్లల్ని మీ అవకాశాల మేరకు ఏదో ఒక ఊరికి తీసుకు వెళ్ళండి. లేదా బంధువుల ఇంటికి పంపించండి. మీ వూరిలోనూ, ప్రక్క వూరిలోనూ ఇంతవరకూ మీ పిల్లలు చూడని ప్రాంతాలను మీరు చూపించండి. లేదా ఇతర పిల్లలతో పంపించండి. రకరకాల వృత్తుల వారిని పరిచయం చేయండి. వివిధ వర్గాల ప్రజల జీవితం స్థూలంగా చూపించండి.

# స్వీకారం

1. అబద్ధం- హెచ్చార్కె కవితలు- (1987-92) పేజీలు 50, వెల రు. 13-00 ప్రతులకు : నవోదయ బుక్ హౌస్, 3-3-805 ఆర్యసమాజ్ ఎదురుసందు, కాచిగూడ, హైదరాబాదు-500027
2. రోడ్డుమీద గులాబి (కథలు)- పి. చంద్రశేఖర అజాద్, పేజీలు 160. వెల : రు. 15-00 జ్ఞాపిన్ ప్రచురణ- ప్రతులకు : ప్రజాశక్తి బుక్ హౌస్ విజయవాడ-2
3. స్వేదబిందువు- విజయాల కేంద్ర బిందువు, కవితలు : శశికాంత్ శాతకర్ణి పేజీలు 80 వెల రు. 5-00 ప్రచురణ, ప్రతులకు : కళాకేళి ప్రచురణ, పిఠాపురం 533350
4. విజృంభణ, పి.డి.యస్.యు. మాసపత్రిక, జనవరి 93 వెల : రు.3-00 ప్రతులకు వి. శంకర్ C/o టి. సంజీవ్, రూమ్ నెం. 12, గోదావరి (ఎ) హాస్టల్, ఉస్మానియా యూనివర్శిటీ కేంపస్, హైదరాబాద్-7
5. విద్యార్థి తిరుగుబాటు (విద్యార్థి యువజన మాసపత్రిక), డిసెంబరు 92-ఫిబ్రవరి 93 వెల : రు. 10-00, ప్రతులకు : ఎడిటర్, 11-8-179/2 లెనిన్ నగర్, ఖమ్మం 507001
6. బుద్ధ నగరం (కవితలు) కాట్రగడ్డ పేజీలు 32 వెలలేదు. ప్రతులకు . కాట్రగడ్డ, ఏలూరు 534003
7. మహాసేవ, (త్రాగుబోతులూ జిందాబాద్) 1926లో కాళ్ళకూరి నారాయణ రావుగారు రాసిన నాటకం. 112 పేజీలు వెల : రు. 10-00 ప్రచురణ : జయంతి పబ్లికేషన్స్, కారల్‌మార్క్స్ రోడ్, విజయవాడ-2
8. సారా మానండి. (మద్యపాన వ్యతిరేక ప్రచార గేయాలు) సేకరణ : దివ్య 16 మంది రచయితల 47 పాటలు. పేజీలు 64 వెల. రు. 6-00 ప్రతులకు : అరుణారుణ ప్రచురణలు, సూర్యాపేట, నల్లగొండజిల్లా 508213
9. ఆధునిక కవిత్వం (వ్యాసాలు) జూలూరు గౌరీశంకర్, పేజీలు 107 వెల : రు. 10-00 ప్రచురణ : శివ ప్రచురణలు, కోదాడ, ప్రతులకు : నవోదయ బుక్ హౌస్, 3-3-865, స్ట్రీట్ ఆర్యసమాజ్ ఎదుట, కాచీగూడ, హైదరాబాద్ 500027
10. రగిలే గుండెలు (రచనా కవితలు) రంగు సత్యనారాయణ, పేజీలు 68 వెల: రు. 10-00 ప్రచురణ : నవ్య పబ్లికేషన్స్, హైదరాబాద్-37 ప్రతులకు : శ్రీమతి శిరీష, 37-154/52, అంజయ్య నగర్, జగద్గిరి గుట్ట, హైదరాబాద్ 500037

## చైతన్యవాహిని :

### "మతోన్మాదం - సాంస్కృతికోద్యమ కర్తవ్యాలు" అనే అంశంపై కోదాడలో అరుణోదయ-నల్లగొండ జిల్లా సదస్సు. 16-3-93.

కోదాడలో తే. 16 3-83న 'మతోన్మాదం-సాంస్కృతికోద్యమ కర్తవ్యాలు, అనే అంశంపై నల్లగొండ జిల్లా స్థాయి సదస్సును జిల్లా అరుణోదయ అధ్యక్షులు కా॥ పి. బిక్షం గారు పతాకాన్ని ఆవిష్కరించి ప్రారంభించారు. కా॥ సంతోష్, కా॥ స్వామి, కా॥ వెంకట్‌లు అధ్యక్ష వర్గంగా నిర్వహించిన సదస్సు "ఓ అరుణ పతాకమా" గీతంతో ప్రారంభమైంది. కా॥ విమల బృందం, కా॥ నూతన్, కా॥ శంకరన్నలకు జోహార్లర్పిస్తూ పాట పాడారు.

అరుణోదయ అధ్యక్షుడు దివికుమార్ తన ప్రారంభోపన్యాసంలో "దేశంలో మతోన్మాదం నెత్తిమీద కత్తిలా వేలాడుతోంది. తెలంగాణ పోరాట కాలంలో మతోన్మాదంపై పోరాడిన విధాన్ని జ్ఞాపకం చేసుకోవాలి. 'మాభూమి' నాటకం బందగీకి జోహార్లర్పిస్తూ ప్రారంభమౌతుంది. ఈ బందగీ ఆ నాటి దేశ్‌ముఖ్‌ను వ్యతిరేకించి పోరాడాడు. ఆ ముస్లిం ప్రారంభించిన పోరాటం తర్వాత మహోన్నత పోరాటంగా ఎదిగి అనేక విజయాలు సాధించింది. ఆ నాటి విప్లవాల ఖిల్లా అయిన నల్లగొండ జిల్లాలో ఈ మతోన్మాద వ్యతిరేక పోరాటాన్ని ప్రారంభించడం చాల సముచితంగా వుంది. మతానికి వ్యతిరేకంగా జరుగుతున్న పోరాటం వర్గ సమాజం ఏర్పడిన నాటి నుండి సాగుతూనే వుంది.

"ఈ నాడు సెక్యులరిజం, ప్రజాస్వామ్యం అనేవి కాగితాలపై మాత్రమే వున్నాయి. ఆచరణలో వాటి ఫలితాలు ఎవరికీ అందుబాటులోకి రాలేదు. వీటి ముసుగులో పాలక వర్గాలు ప్రజల సమస్యలను ప్రక్కదార్లు పట్టించడానికి ప్రయత్ని స్తున్నాయి. ఆ ప్రయత్నాల్లో భాగమే 1992 డిసెంబర్ 6న చేసిన దాడి, దాని తర్వాత జరిగిన మూకుమ్మడి హత్యలు, బొంబాయి మత కల్లోలాలు, బాంబు దాడులను.

"ఇక ఇవాళ సామ్రాజ్య వాదం, దాని ఆర్థిక విధానాలు మన దైనందిన జీవితంపై ఏ రకంగా ఆధిపత్యం వహిస్తున్నాయో నేటి డంకెల్ ప్రతిపాదనలు సజీవ ఉదాహరణగా కన్పడతాయి. వీటికి వ్యతిరేకంగా పోరాడే ప్రజలతో, రచయితలుగా, కళాకారులుగా గొంతు కలపాలి" అన్నారు.

ఆ తర్వాత విప్లవ రచయితల సంఘ సభ్యుడు సి. రామ్మోహన్ 'నూతన ప్రజాస్వామిక సంస్కృతి' అనే అంశంపై మాట్లాడారు. తన ప్రసంగంలో ఆయన, "సమాజం లేకుండా సంస్కృతి లేదు. సమాజం అంటే చెట్లూ, పుట్టలూ కాదు. సమస్త ప్రాకృతిక విషయాలు కలిపి సమాజమౌతుంది. సంస్కృతికి అనేక నిర్వచ

నెలున్నాయి. కొందరు సంస్కృతిని మతంతో జోడించి హిందూ సంస్కృతి, ముస్లిం సంస్కృతి అంటారు. కొంత మంది దేశాలతో ముడిపెట్టి- భారతీయ సంస్కృతి, అమెరికన్ సంస్కృతి అంటారు.

"మార్క్సిస్టులుగా సంస్కృతి అంటే మనం ఏం చెబుతున్నాం. అది ఒక జీవన విధానం. సమకాలీన సమాజపు ఆర్థిక, రాజకీయ, సాంఘిక విషయాల ప్రతిబింబమే సంస్కృతి. సమాజం ఎంత సువిశాలమైనదో, ఎంత సంక్షిప్తమైనదో సంస్కృతి కూడా అంత విశాలమైనది, సంక్షిప్తమైనదీను. ఇది పాదార్థికమైనా ఆత్మికమైనది- ఆర్థికమైనది. మనిషి తన మనుగడ కోసం ఉత్పత్తి చేస్తున్న క్రమంలో, ఉత్పత్తి సంబంధాలు ఏర్పరచుకునే క్రమంలో కొన్ని భావాలు, విశ్వాసాలు ఏర్పడుతాయి. దానిపై ఆధారపడే విషయాలే సంస్కృతి. పునాది పైన ఆధారపడే ఉపరితల నిర్మాణంలో భావాలూ, విశ్వాసాలూ వాటి ఆధారంగా ఏర్పడతాయి. పునాదిలో అంటే ఆర్థిక సంబంధాల్లో మార్పు వచ్చిందనుకోండి. క్రమంగా ఉపరితల నిర్మాణంలో మార్పు వస్తుంది. ఇవి ఒక దానిపై ఒకటి ఆధారపడి కొనసాగుతూ వుంటాయి. ఒక దాన్ని ఒకటి ప్రభావితం చేస్తూ కొనసాగుతుంటాయి.

ఈనాడు మన దేశంలో సామ్రాజ్యవాద, భూస్వామ్య, దళారీ వ్యవస్థ వుంది. దాని కనుగుణంగానే సంస్కృతి వివిధ రూపాల్లో వుంది. భూస్వామ్య సామ్రాజ్య వాద సంస్కృతులు పరస్పరం కలసి ప్రజలను సాంస్కృతిక దోపిడీ చేస్తున్నాయి. ఈ ప్రజా వ్యతిరేక సంస్కృతిని ప్రతిఘటిస్తూ అనాదిగా ప్రజా పోరాట సంస్కృతి పోరాటాలు జరుగుతున్నాయి. పాత సంస్కృతిలోని మంచిని స్వీకరిస్తూ, చెడుకి వ్యతిరేకంగా జరిగే సాంస్కృతిక పోరాటాలు కొనసాగాలి." అన్నారు.

"ప్రజా కళా రూపాలు- సాంస్కృతికోద్యమంలో వీటి పాత్ర" అనే అంశం పై 'సుప్రభాతం' జర్నలిస్టు లక్ష్మణ్ మాట్లాడుతూ, "ఏ ప్రజా కళా రూపమైనా ఆయా కుల వృత్తుల ఆధారంగా ఉద్భవించాయి. ఆ కళా రూపాలను అధ్యయనం చేయాలంటే ఆయా కులాలను, వీటి చరిత్రలు, వీటి వునికి కోసం జరిగిన పోరాటాల

---

(తరువాయి 44 వ పేజీ)

"వారు అలా సెలవిచ్చారు మరి."

"మరయితే వీళ్ళ ప్రభుత్వం త్రిపురలో ఓడిపోయింది కదా! అంటే నర సింగంగారి పాలన మహా చెత్తగా వున్నట్టే కదా?" లాపాయింట్ తీసాడు భగో.

"అదేం కాదని, స్థానిక సమస్యలే ఓడిపోవడానికి గల కారణమని గాడ్గిల్ గారు సెలవిచ్చారు కదా!"

"ఏం ? ఎందుకనో అక్కడో నీతి? ఇక్కడో నీతి?"

"తప్పు! గొప్పవాళ్ళు గొప్ప మాటల్ని శంకించకూడదు. విని తరిం చాల్సిందే" ఉపదేశించాడు గోవిందం.

అధ్యయనం చేసినపుడే ఆ కులాల చరిత్ర అర్థమౌతుంది. దాని ఆధారంగా సాంస్కృతిక అంశాలు, వాటి ఆధారంగా కళా రూపాల చరిత్ర అర్థమౌతుంది.

"రాముడు ప్రజలందరి దేవుడు కాడు. కేవలం అగ్రవర్ణమైన బ్రాహ్మణులకు పరిమితమైనవాడే రాముడు. కింది కులాలవారికి వారి వారి స్థానిక దేవుళ్ళున్నారు. అలాగే వ్రతాలు, పండుగలు, పూజలు మెజారిటీగా వున్న అగ్ర వర్ణాల సృష్టే. వాటిని వివరంగా అధ్యయనం చేయాలి. ఈ మధ్య జాంబవంతుని కథను విన్నాం. కళా రూపంగా, దాన్నొక కథగా చూస్తే పాక్షికమే అవుతుంది. అందులోని వస్తువేమిటంటే ఈ ప్రపంచంలో ఎవరు మొదటివారు ? ఈ సర్వ సంపద సృష్టికి మూల కారకులెవరు ? బ్రాహ్మణిజం ప్రకారం బ్రహ్మ, విష్ణు, ఈశ్వరులు కాదు- కష్టజీవులమైన మేము అని చెప్పడం దానిలో వస్తువు. మతానికీ, కులానికీ, కళా రూపానికీ వున్న సంబంధాన్ని అధ్యయనం చేయకుండా ఆ కళా రూపాల్ని సజీవంగా నిలబెట్టలేం." అన్నారు.

ఆ తర్వాత కె.పి. భిక్షంగారు 'ప్రజా కళా రూపాలు - అనుభవాలు' అనే అంశంపై ప్రసంగిస్తూ "కళా రూపాలు ఎవరో గాలిలో సృష్టించినవి కావు. తమ మనుగడకోసం సాగిన పోరాటంలో ప్రజలే సృష్టించుకున్నవి. తమ కులాల చరిత్రను మౌఖికంగా ముందు తరాల కోసం అందించే క్రమంలో సృష్టించుకున్నవే పిచ్చుకుంట్ల కథ, ఒగ్గు కథ, శారదగాళ్ళ కథ మొదలైనవి. వాటిని తెలంగాణా పోరాట కాలంలో విప్లవీకరించుకున్నారు. ఆ వారసత్వాన్ని అరుణోదయ కొనసాగిస్తోంది. ఇంకా అనేక కళా రూపాలు అంతరించి పోతున్నాయి. వాటిని సేకరించాలి" అంటూ వివిధ కళా రూపాలను సోదాహరణంగా పాడుతూ వివరించారు. తన గత 30 సంవత్సరాల అనుభవాలను వివరించా .

అరుణోదయ రాష్ట్ర కార్యదర్శి ఉదయ్ "ప్రజా కళా రూపాలు-అనుభవాలు" అనే అంశంపై మాట్లాడుతూ "సినిమాను ఎలా సోషలిస్టు పంథాలోకి మల్చాలి ?" అని లెనిన్ అడిగినప్పుడు ఐసెన్‌స్టీన్ అనే కళాకారుడు "తూర్పు దేశాలలో వున్న జానపద కళలన్నిటినీ జోడించి, వాటిలోని ఎలియనేషన్ ప్రక్రియను ఉపయోగిస్తే ఖచ్చితంగా కళా రూపాలను సోషలిస్టు పంథాలోకి మలచవచ్చు" అన్నాడని చెపుతూ ప్రజలు సృష్టించిన కళా రూపాల్లో సజీవత్వం కన్పిస్తుందన్నారు.

"ఈ కళా రూపాలను అకడమిక్‌గా కాకుండా వాటి చారిత్రక నేపథ్యాన్ని క్షుణ్ణంగా అధ్యయనం చేయాలి. వాటిని పరిపుష్టం చేయాలి; ఎలియనేషన్ ప్రక్రియను ఆధునిక వీధి నాటకం ద్వారా ప్రగతి శీల శక్తులు ప్రజల దగ్గరకు వెళుతున్నాయి. అయితే శత్రువుకున్న సాధనాలతో పోలిస్తే మన శక్తి చాల తక్కువే. అయినా, మనిషి నుంచి మనిషికి అనే పద్ధతి ద్వారా శత్రువు సాంస్కృతిక దాడిని త్రిప్పికొట్ట

అరుణోదయ కార్యవర్గ సభ్యుడు - కె. వెంకటయ్య, 'పాట పుట్టుక' అనే అంశంపై మాట్లాడుతూ, "పాట జీవితం నుండే పెల్లుబుకుతుంది. పాట రాయాలంటే అసలు సమస్యపట్ల ముందు నిబద్ధత వుండాలి. సమస్య పూర్వాపరాలు తెలియాలి. ప్రజలపట్ల వినమ్రంగా వున్నపుడే ప్రజల పాటలు రాయగల్గుతాం."

అరుణోదయ ప్రధాన కార్యదర్శి రామారావు "నేటి సినిమాల్లో బూతులు" అనే అంశంపై ప్రసంగించారు.

ఊరేగింపు అనంతరం జరిగిన బహిరంగ సభలో దివికుమార్, భాస్కర్, కోటేశ్వరరావు, విమల, ఉదయ్ తదితరులు వివిధ సాంస్కృతిక అంశాలపై ప్రసంగించారు. విమల గానం చేసిన "ప్రతిఘటనాస్వరాలు" కేసెట్‌ను అరుణోదయ రాష్ట్ర ప్రధాన కార్యదర్శి రామారావు ఆవిష్కరించారు.

---

## "మతోన్మాదం-సాహిత్యం"పై బహిరంగ సభ

### జనసాహితి, హైదరాబాద్ నగరశాఖ

28-3-93 ఆదివారం సాయంత్రం 6-00. లకు జనసాహితి, హైదరాబాద్ నగరశాఖ ఆధ్వర్యాన జనసాహితి సభ్యుడు ప్రతీప్ అధ్యక్షతన 'మతోన్మాదము - సాహిత్యము' అన్న అంశంపై సిటీ సెంట్రల్ లైబ్రరీలో బహిరంగ సభ జరిగింది. మతోన్మాదాన్ని ఎదుర్కోవటంలో పాత్రికేయుల పాత్ర, బాధ్యత వివరిస్తూ మొదట ఆంధ్రప్రభ పాత్రికేయుడు దేవులపల్లి అమర్ మాట్లాడారు. డిసెంబర్ 6 ముందు అయోధ్యలో ఏమి జరగబోతోందో పాత్రికేయులందరికీ తెలిసినా కూడా, ఎవరూ దాని గురించి హెచ్చరించి, మసీదు కూల్చివేతను ఆపే ప్రయత్నం చేయలేదనీ, అలాగే సత్యాన్ని రిపోర్టు చేసేటప్పుడు జరిగే హానిని పాత్రికేయులు గుర్తించాలనీ, వివిధ ప్రాంతాల్లో జరిగే మత కల్లోలాలు నిజానికి మతానికి సంబంధించినవి కావనీ, రాజకీయ ప్రయోజనాల రీత్యా సాగే ముఠా తగాదాల పర్యవసానమనీ, పత్రికలు ఏ అల్లర్లలో ఎందరు మరణించారో తెలియచేసే సమాచారాన్నందించడంలో చూపుతున్న ఆసక్తి, ఆ సంఘటనలను విశ్లేషించడంలో చూపడం లేదనీ, ప్రభుత్వం మతతత్త్వవాదులపట్ల ఒక రకంగానూ అంటే ఉదారంగానూ, వామపక్షవాదులపట్ల నిర్బంధపూరితంగానూ ప్రవర్తిస్తోందనీ, అన్నారు.

ఆ తర్వాత మాట్లాడిన జనసాహితి ప్రధాన కార్యదర్శి కొత్తపల్లి రవిబాబు తన ప్రసంగంలో, "సాహిత్యంపై మతోన్మాదుల దాడులు చార్వాకులు, లోకాయతుల కాలంనుండీ ప్రారంభమై కొనసాగుతోంది. అనాటి హిందూ మతోన్మాదులు చార్వాకుల, లోకాయతుల గ్రంథాలను ధ్వంసం చేశారు. ఈనాటి మతోన్మాదులు తమకు నచ్చని పుస్తకాలు రాసేవారిని చంపుతామని, దాడులు చేస్తామని బెదిరిస్తు

న్నారు - కొన్ని సందర్భాలలో దాడులు చేశారు. అమెరికాలోని 'పాత్రికేయుల పరిరక్షణా కమిటీ' 1992లో 'పత్రికలపై దాడులు' అన్న తన నివేదికలో 1991లో ప్రపంచవ్యాప్తంగా పాత్రికేయులపై జరిగిన దాడులలో అత్యధికం ఇండియాలో జరిగాయని రాసింది.

ఇవన్నీ ఏం తెలియచేస్తున్నాయంటే ఫాసిస్టు పోకడలు క్రమక్రమంగా దేశంలో ప్రవేశిస్తున్నాయని. గతంలో హిట్లర్ యూదు జాతీయులైన మేధావులను ఐన్‌స్టీన్ మొదలైనవారిని జర్మనీనుంచి బహిష్కరించాడు. జె. బి. ఎస్. హాల్డైన్ అటువంటి యూదు మేధావులకు ఇంగ్లండ్‌లో ఆశ్రయం కల్పించారు. నాజీలు 20 వేల గ్రంథాల్ని అలెగ్జాండ్రియా గ్రంథాలయాన్ని దహనం చేశారు. గతంలో అఖిల భారత విద్యార్థి పరిషత్‌వారు ఉస్మానియా విశ్వవిద్యాలయ గ్రంథాలయంలో వున్న మార్క్సిస్టు గ్రంథాలను దహనం చేశారు.

అలాగే ఫాసిజం మహిళలను కేవలం వంట ఇంటి మనిషిగా చూస్తుంది. ఆడవారికి ఆర్. ఎస్. ఎస్ లో స్థానం లేదు. ఫాసిజం ప్రకారం "ఆడదాని చోటు ఇల్లే. అలసి సొలసి వచ్చిన వీరుణ్ణి సంతోషపరటడమే ఆమె కర్తవ్యం. గోల్వాల్కర్ ప్రకారం, అందంగా వుండటం, బిడ్డల్ని కనడం ఆడవాళ్ళ కర్తవ్యం మగవాళ్ళు ఆమె తిండీ, తిప్పలు చూస్తారు."సతీ సహగమనాన్ని స్త్రీ పురుషుల అసమానతలనూ వర్ణాశ్రమ ధర్మాలనూ, కులాలనూ సమర్థించే కళ్యాణ్‌సింగ్ కల్వీలాంటివారూ వర్ణాశ్రమ వ్యవస్థను - కుల వ్యవస్థనూ సమర్థించే జియర్ స్వాములు, లక్ష్మణ యతీంద్రులు, చిన్మయానందలు ఈనాడు నాయకులు కావడం ఆశ్చర్యకరమైన విషాదం. అబద్ధాలను పదేపదే చెప్పి నిజమని నమ్మించడమూ ఫాసిస్టు గుణమే. కాశ్మీర్‌లో దేవాలయాల ధ్వంసం గురించీ, రాముడి జన్మభూమి గురించీ ఆర్యులు వలస రావడం గురించీ, ముస్లిం జనాభా పెరిగిపోవడం గురించీ హిందూ మతోన్మాదులు అబద్ధాలను పదేపదే ప్రచారం చేస్తున్నారు.

జర్మన్ ఫాసిజంపై పోరాడిన బల్గేరియా వీరుడు డిమిట్రోవ్ సాహసాన్నీ, సత్యంకోసం మరణించిన గెలీలియో మొదలగువారి ధైర్యసాహసాలే ఆదర్శంగా ప్రజా రచయితలు మతతత్వవాదుల బెదిరింపులకు, దాడులకు భయపడక మతతత్వ రాక్షసిని ఎదుర్కొంటారు" అన్నారు.

చివరగా విప్లవ రచయితల సంఘం కార్యవర్గ సభ్యుడు వరవరరావు మాట్లాడుతూ, హిందూ మతోన్మాదం పూనాలో, నాగపూర్‌లో అంటే మహారాష్ట్రలో ముస్లిములు ఎక్కువగా లేని ప్రాంతంలో ఎందుకు ప్రారంభమైందో వివరిస్తూ, అక్కడ సాంఘిక ఉద్యమాలు, దళిత ఉద్యమాలు కారణమన్నారు. హిందూ మతంలోనే ఫాసిస్టు ధోరణి వుందన్నాం. ఈనాడు ప్రపంచవ్యాప్తంగా ఇస్లాం మతం మీద

దాడి జరుగుతోందనీ, దీనికి కారణం వారు సామ్రాజ్యవాదులను వ్యతిరేకించడమే నన్నారు.

ముస్లిముల జనాభా పెరిగిపోతోందన్న బి జె. పి. వాదన సరైంది కాదనీ, ముస్లిములు పుట్టుకతోనే దేశద్రోహులన్న పద్ధతిలో వ్యవహరించడాన్ని ఖండిస్తూ ఖాదర్ 'పుట్టుమచ్చ' కవితను ఉదహరించారు. నిజానికి మతతత్వవాదులే మైనారిటీ ప్రజలే మెజారిటీ. ఈ మతతత్వాన్ని ఎదుర్కోవడంలో నిర్దిష్ట కార్యాచరణకు విరసం సంసిద్ధంగా వుందని ప్రకటించారు.

---

## జనసాహితి ప్రచురణ 'జన విజయం' ఆవిష్కరణ సభ

93 మే 1వ తేదీన ఒంగోలు మహిళా సమాజం ఆవరణలో ప్రకాశం జిల్లా జనసాహితి, అరుణోదయల సంయుక్త నిర్వహణలో జనసాహితి ప్రచురణ 'జన విజయం' సాహిత్య కళారూపం ఆవిష్కరణ సభ మేడే సందర్భంగా జరిగింది. ప్రముఖ రచయిత నాగభైరవ కోటేశ్వరరావుగారు ఆవిష్కరించారు. రచయిత, అడ్వకేట్ బి. హనుమారెడ్డిగారు, ఎ.పి.సి.ఎల్.ఏ. నాయకుడు డా. ఎ. పి. విఠల్, జనసాహితి ప్రధాన కార్యదర్శి కొత్తపల్లి రవిబాబు, 'జన విజయం' రచయిత డా॥ శాంతికుమార్‌లు ప్రసంగించిన తర్వాత, అరుణోదయ కళాకారులూ, అడ్వకేట్లతో కూడిన బృందం 'జన విజయం'ను ప్రదర్శించింది. సభకు అరుణోదయ రాష్ట్ర కార్యవర్గ సభ్యుడు పి. గోవిందరావు అధ్యక్షత వహించారు.

---

## ఉత్తరాలు :

మార్చి 93 (137) సంచికలో "ఇటీవలి నవలలు — స్త్రీవాద ధోరణులు" అనే వ్యాసం సమాచారాన్నిస్తూ సన్మార్గ విచికిత్సను సమర్థవంతంగా చేసింది. స్త్రీ వాదం గురించి ఇటీవల తెలుగు పత్రికల్లో చాలా గందరగోళం వస్తోంది. కానీ కనీసం ప్రాథమిక ప్రాతిపదిక సమాచారాన్నీ చారిత్రక వికాసాన్నీ చర్చించడంలేదు. ఆ లోపాన్ని పూరించిన కాత్యాయనిగారి వ్యాసాన్ని మెచ్చుకోక తప్పదు. దివికుమార్ వ్యాసంపై సోమసుందర్‌గారి సమాధానం వస్తే ప్రచురించండి.

కాకినాడ - 3 మీరా

---

## రాహుల్ సాంకృత్యాయన్ సంచిక (138)

మహా పండిత రాహుల్ సాంకృత్యాయన్ శత జయంతి సంచిక, ఆ మహా మనీషి, బహుముఖ ప్రజ్ఞకు, నిరంతర చారిత్రక పరిశోధనా దీక్షకు, అవిశ్రాంత రచనాచణత్వానికి, ప్రజా సేవకు, రక్తికి దర్పణంలా వెలువడింది.

న్నారు - కొన్ని సందర్భాలలో దాడులు చేశారు. అమెరికాలోని 'పాత్రికేయుల పరిరక్షణా కమిటీ' 1992లో 'పత్రికలపై దాడులు' అన్న తన నివేదికలో 1991లో ప్రపంచవ్యాప్తంగా పాత్రికేయులపై జరిగిన దాడులలో అత్యధికం ఇండియాలో జరిగాయని రాసింది.

ఇవన్నీ ఏం తెలియచేస్తున్నాయంటే ఫాసిస్టు పోకడలు క్రమక్రమంగా దేశంలో ప్రవేశిస్తున్నాయని. గతంలో హిట్లర్ యూదు జాతీయులైన మేధావులను ఐన్‌స్టీన్ మొదలైనవారిని జర్మనీనుంచి బహిష్కరించాడు. జె. బి. ఎస్. హాల్డైన్ అటువంటి యూదు మేధావులకు ఇంగ్లండ్‌లో ఆశ్రయం కల్పించారు. నాజీలు 20 వేల గ్రంథాల్ని అలెగ్జాండ్రియా గ్రంథాలయాన్ని దహనం చేశారు. గతంలో అఖిల భారత విద్యార్థి పరిషత్‌వారు ఉస్మానియా విశ్వవిద్యాలయ గ్రంథాలయంలో వున్న మార్క్సిస్టు గ్రంథాలను దహనం చేశారు.

అలాగే ఫాసిజం మహిళలను కేవలం వంట ఇంటి మనిషిగా చూస్తుంది. ఆడవారికి ఆర్. ఎస్. ఎస్ లో స్థానం లేదు. ఫాసిజం ప్రకారం "ఆడదాని చోటు ఇల్లే. అలసి సొలసి వచ్చిన వీరుణ్ణి సంతోషపరటడమే ఆమె కర్తవ్యం. గోబెల్స్ ప్రకారం, అందంగా వుండటం, బిడ్డల్ని కనడం ఆడవాళ్ళ కర్తవ్యం మగవాళ్ళు ఆమె తిండీ, తిప్పలు చూస్తారు."సతీ సహగమనాన్ని స్త్రీ పురుషుల అసమానతలనూ వర్ణాశ్రమ ధర్మాలనూ, కులాలనూ సమర్థించే కళ్యాణ్‌సింగ్ కల్వీలాంటివాళ్ళూ, వర్ణాశ్రమ వ్యవస్థను - కుల వ్యవస్థనూ సమర్థించే జియర్ స్వాములు, లక్ష్మణ యతీంద్రులు, చిన్మయానందలు ఈనాడు నాయకులు కావడం ఆశ్చర్యకరమైన విషాదం. అబద్ధాలను పదేపదే చెప్పి నిజమని నమ్మించడమూ ఫాసిస్టు గుణమే. కాశ్మీర్‌లో దేవాలయాల ధ్వంసం గురించీ, రాముడి జన్మభూమి గురించీ ఆర్యులు వలస రావడం గురించీ, ముస్లిం జనాభా పెరిగిపోవడం గురించీ హిందూ మతోన్మాదులు అబద్ధాలను పదేపదే ప్రచారం చేస్తున్నారు.

జర్మన్ ఫాసిజంపై పోరాడిన బల్గేరియా వీరుడు డిమిత్రోవ్ సాహసాన్నీ, సత్యంకోసం మరణించిన గెలీలియో మొదలగువారి ధైర్యసాహసాలే ఆదర్శంగా ప్రజా రచయితలు మతతత్వవాదుల బెదిరింపులకు, దాడులకు భయపడక మతతత్వ రాక్షసిని ఎదుర్కొంటారు" అన్నారు.

చివరగా విప్లవ రచయితల సంఘం కార్యవర్గ సభ్యుడు వరవరరావు మాట్లాడుతూ, హిందూ మతోన్మాదం పూనాలో, నాగపూర్‌లో అంటే మహారాష్ట్రలో ముస్లిములు ఎక్కువగా లేని ప్రాంతంలో ఎందుకు ప్రారంభమైందో వివరిస్తూ, అక్కడ సాంఘిక ఉద్యమాలు, దళిత ఉద్యమాలు కారణమన్నారు. హిందూ మతంలోనే ఫాసిస్టు ధోరణి వుందన్నాం. ఈనాడు ప్రపంచవ్యాప్తంగా ఇస్లాం మతం మీద

దాడి జరుగుతోందనీ, దీనికి కారణం వారు సామ్రాజ్యవాదులను వ్యతిరేకించడమే నన్నారు.

ముస్లిముల జనాభా పెరిగిపోతోందన్న బి జె. పి. వాదన సరైంది కాదనీ, ముస్లిములు పుట్టుకతోనే దేశద్రోహులన్న పద్ధతిలో వ్యవహరించడాన్ని ఖండిస్తూ ఖాదర్ 'పుట్టుమచ్చ' కవితను ఉదహరించారు. నిజానికి మతతత్వవాదులే మైనారిటీ ప్రజలే మెజారిటీ. ఈ మతతత్వాన్ని ఎదుర్కోవడంలో సమిష్టి కార్యాచరణకు విరసం సంసిద్ధంగా వుందని ప్రకటించారు.

---

## జనసాహితి ప్రచురణ 'జన విజయం' ఆవిష్కరణ సభ

93 మే 1వ తేదీన ఒంగోలు మహిళా సమాజం ఆవరణలో ప్రకాశం జిల్లా జనసాహితి, అరుణోదయల సంయుక్త నిర్వహణలో జనసాహితి ప్రచురణ 'జన విజయం' సాహిత్య కళారూపం ఆవిష్కరణ సభ మేడే సందర్భంగా జరిగింది. ప్రముఖ రచయిత నాగభైరవ కోటేశ్వరరావుగారు ఆవిష్కరించారు. రచయిత, అడ్వకేట్ బి. హనుమారెడ్డిగారు, ఎ.పి.సి.ఎల్.ఎ. నాయకుడు డా. ఎ. పి. విఠల్, జనసాహితి ప్రధాన కార్యదర్శి కొత్తపల్లి రవిబాబు, 'జన విజయం' రచయిత డా॥ శాంతికుమార్‌లు ప్రసంగించిన తర్వాత, అరుణోదయ కళాకారులూ, అడ్వకేట్లతో కూడిన బృందం 'జన విజయం'ను ప్రదర్శించింది. సభకు అరుణోదయ రాష్ట్ర కార్యవర్గ సభ్యుడు పి. గోవిందరావు అధ్యక్షత వహించారు.

---

## ఉత్తరాలు :

మార్చి 93 (137) సంచికలో "ఇటీవలి నవలలు — స్త్రీవాద ధోరణులు" అనే వ్యాసం సమాచారాన్నిస్తూ సన్మార్గ విచికిత్సను సమర్ధవంతంగా చేసింది. స్త్రీ వాదం గురించి ఇటీవల తెలుగు పత్రికల్లో చాలా గందరగోళం వస్తోంది. కానీ కనీసం ప్రాథమిక ప్రాతిపదిక సమాచారాన్నీ చారిత్రక వికాసాన్నీ చర్చించడంలేదు. ఆ లోపాన్ని పూరించిన కాత్యాయనిగారి వ్యాసాన్ని మెచ్చుకోక తప్పదు. దేవి కుమార్ వ్యాసంపై సోమసుందర్‌గారి సమాధానం వస్తే ప్రచురించండి.

కాకినాడ - 3 — మీరా

---

## రాహుల్ సాంకృత్యాయన్ సంచిక (138)

మహా పండిత రాహుల్ సాంకృత్యాయన్ శత జయంతి సంచిక, ఆ మహా మనీషి, బహుముఖ ప్రజ్ఞకు, నిరంతర చారిత్రక పరిశోధనా దీక్షకు, అవిశ్రాంత రచనాచణత్వానికి, ప్రజా సేవకు, రక్తికి దర్పణంలా వెలువడింది.

డా॥ సంజీవదేవ్‌గారి స్మృతులు, కాకరాల, ఛాయారాజ్‌గార్ల విశ్లేషణలు ఆలోచనలను రేకెత్తిస్తాయి. మీ ప్రయత్నం అభినందనీయం.

కడప — జానమద్ది హనుమచ్ఛాస్త్రి

రాహుల్ ప్రత్యేక సంచిక చాలా బాగుంది. ఎన్నో విషయాలు తెలుసుకో గలిగాను.

అమలాపురం — డా. ద్వా. నా. శాస్త్రి

ఏప్రిల్ 93 'ప్రజాసాహితి' రాహుల్ స్మరణలో తన పేరును సార్థకం చేసుకుంది. రాహుల్‌జీని అధ్యయనం చేద్దామని పిలుపిచ్చిన ఛాయరాజ్ తన చక్కని శైలిలో రాహుల్‌జీ విలువైన భావాలను వెలిబుచ్చుతూ, ఎంతో స్ఫూర్తివంతంగా వ్యాసాన్ని ముగించి, మంచి వ్యాసకర్తగా కూడా పరిచయమయ్యాడు. మాయావాదం నుంచి మార్క్సిజం దాకా వ్యాసంతో కాకరాల తానొక గొప్ప పరిచయకర్తగా నిజానికి పాఠకులకు తనని తాను పరిచయం చేసుకున్నారు.... చలసాని ప్రసాద రావుగారి వ్యాసం గురించి-వారు తాము feel అయిన కొన్ని ముఖ్య విషయాలను తీసుకుంటారు. వాటిని తన శైలి అనే చిన్న పిల్ల కాలువలో స్నానం చేయిస్తారు.... 'మనందరిలో వున్నాడు రాహుల్జీ' అన్నవ్యాసం ఎంతో చక్కగా వుంది. డా॥సంజీవ దేవ్‌గారి వ్యాస లో యింకా చెప్పవలసిన సంగతులు ఎన్నో వుండాలి. అవి తెలుప లేదు అనిపించింది.

మనకున్న ఒక్కగానొక్క రాహుల్ - సాహును పోగొట్టుకున్నాం అన్న బాధ గుండెలో తొలుస్తూనే వుంటుంది. సాహు లేని లోటు తీరేది కాదు....

చివరిగా రాహుల్ సాంకృత్యాయన్‌గారి రచన ఒక్కటయినా యిచ్చి వుంటే సంచికకు మరింత నిండుతనం వచ్చి వుండేది.

విశాఖ — నటరాజ్

'ప్రజా సాహితి' ఈరోజే చూశాను. బాగుంది. యిది మొహమాటంలో అనడం లేదు. జీవనాడి పత్రికతో ప్రారంభమైన మా సాహిత్య సేవ రివల్యూషనరీ సాహితీ పత్రికలన్నిటికంటె ఎంతో కొంత ఉన్నతంగా వుంటోంది. సాహిత్య పత్రికలు చర్చ చేసినపుడు తరచుగా నేను అనే మాట యిది.

మరొక మనవి. నేను నెలల కాలం టూర్‌లోనే వుంటాను.... గనుక మీరు అనవసర శ్రమ తీసుకొని పత్రిక పంప వద్దని సవినయంగా మనవి చేస్తున్నాను. మరోలా భావించవద్దు.

హైదరాబాదు — కానూరి వెంకటేశ్వరరావు

# నీ చావు గురించే రాస్తున్నాను
# ఎలిజీ మాత్రం కాదు సుమా !

ఛిద్రమైన నీ శరీరాన్ని చూసినప్పుడు
నువ్వు ముక్కలు ముక్కలు చేసిన
నా మాతృ దేశం గుర్తొచ్చింది
పంజాబ్ గుర్తొచ్చింది

నీ తల్లి మరణించిన రాత్రి
ఢిల్లీ వీథుల్లో నీ ప్రతీకార బెర్రలిజం,
సజీవ దహనమై పోయిన
చర్మాల కమురు కంపు,

ఎదిగొచ్చిన బిడ్డల ముందే వివస్త్రలైన
తల్లుల ఆర్తనాదాలు-
అన్నీ గుర్తొచ్చాయి
పులుల్ని మచ్చిక చేసుకొని
మాంసం వేసి దువ్వి

పక్క దేశం మీదకి వదిలి
తర్వాత శాంతి పరిరక్షక ముసుగేసుకొని జొరబడ్డ
నీ కుటిలత్వమూ గుర్తొచ్చింది
బతికున్నప్పటి నీ సన్నని చిరునవ్వుల్ని చూస్తే
వేటాడే ముందర 'హైనా' నవ్వులు జ్ఞాపకానికొచ్చేవి

రోడ్ల మీద వేసిన శిబిరాల్లో
భగవద్గీతా పారాయణం అగరొత్తుల ధూపం మధ్య
హుందాగా నవ్వుతున్న నీ నిలువెత్తు చిత్తరువుల్ని చూస్తే
వేలాది మంది తల్లుల గర్భశోకాన్ని చూసి
సరదాగా నవ్వినట్లుంది

ఆక్రోశంతో వీధిన పడ్డ ప్రజల్ని
జైళ్ళల్లో కుక్కి మరీ రిలీఫ్‌గా నవ్వినట్లుంది
పైర్లకి చల్లాల్సిన పురుగు మందుని తాగి
నీలంగా మారిపోయి నురుగులు కక్కిన రైతు శవాల్ని చూసి
చీడ పురుగులా నవ్వినట్లుంది

దేశం మొత్తాన్ని దొంగగా చుట్టి
వైట్ హౌస్ లోనో మాస్కో పార్లమెంట్ లోనో కార్పెట్ గా పరచి
సామ్రాజ్య వాద ముందు విశ్వాస పాత్రంగా నవ్వినట్లుంది
ఒక ఉన్మత్త విధ్వంసంలో నీ శరీరం పేలిపోయినా
గంధపు చెక్కల్లో కాలిపోయినా
నీ శవం బహుముఖాలుగా బతుకుతూనే వుంది
ప్రభుత్వంగా పోలీసుగా జైలుగా ప్రజల మీద నిర్బంధంగా
నీ ఆత్మ సజీవంగానే వుంది
నీ అసలు ప్రాణం
వ్యవస్థ గర్భంలో యింకా క్షేమంగానే వుంది
నిన్ను సమూలంగా నిర్మూలించేందుకు
మేం వ్యవస్థను తవ్వుతూనే వుంటాం!
(మే 21, టెర్రరిస్టు వ్యతిరేక దినంట!)

— అరణ్య కృష్ణ

---

( 6 వ పేజీ తరువాయి)

మాత్రమే దానవతను రూపుమాపి, మానవతకు పట్టం కట్టునని, కార్మిక వర్గం నాయకత్వంలోనే అది సాధ్యమని ఈ 'మేడే' నుండి మనం పొందవలసిన విప్లవ స్ఫూర్తి. అలా ప్రపంచ రాజకీయ పరిణామాన్నింటినుండి గుణపాఠాలు తీసుకొని, భారత ప్రజల విముక్తికోసం రాజీ లేకుండా పోరాడుతున్న విప్లవకర కార్మికసంస్థలు-భారత కార్మిక సంఘాల సమాఖ్య, వర్కర్స్ సాలిడారిటీ, మరి యితర కార్మిక సంస్థలు బొంబాయిలో మే నెల 7, 8 తేదీల్లో సమావేశమై, విప్లవ ఐక్య కార్మికోద్యమం కోసం ఐక్యం కావాలని నిర్ణయించుకోవడం భారత కార్మికవర్గ ఉద్యమ చరిత్రలో గొప్ప మైలురాయి. చీలికలు, విభజనలతో విసిగిపోతూ, నిరాశతో నున్న దశలో ఈ ఐక్యత గొప్ప ఆశాకిరణం.

"కుల, మత, భాషా విభేదాలు వదలి పీడిత ప్రజలంతా ఒక్కటే, పోరాటం ఒక్కటే మార్గం" అని విశ్వ విప్లవ కార్మికోద్యమం కోసం కృషి సల్పుతున్న పై కార్మిక సంస్థల ఆశయం అజేయంగా ముందుకు సాగాలని 'ప్రజా సాహితి' విశ్వసిస్తోంది. విప్లవాభివందనాలు తెలుపుతోంది. (5-5-93)

---

Edited, Printed and Published by K. RAVI BABU on behalf of
JANA SAHITI (A.P.), at Chaitanya Printers, Vijayawada-2,
for Co-operative Press, Vijayawada.
Working Editor : NIRMALANANDA

## అనుకున్నట్లు జరిగే యుగం

కాలం తాననుకన్నట్టే గుండ్రంగా నడుస్తుంది!
వంకరగా పరుగులెత్తడం దాని ఆశయం కాదు!
కనుకనే సూర్యోదయాలూ చంద్రాస్తమయాలూ
ఋతుక్రమాలూ గ్రహణాలూ తోకచుక్కలూ

"అన్నీ మనమనుకున్నట్టే జరుగుతాయా
మన పెత్రికానీ అలా అలా రాసిపెట్టారు
కనుక మనం అనుకుని అందుకోగలమా
రాసిపెట్టినట్లే అన్నీ జరిగి తీరతాయి"

సర్వత్రా అనుకునే మాటలే సంసారాల్లో
మన దేశం నిండా మనుషుల భావాలు!
ఏటి ప్రభావాలివి? ఎవరు నేర్పిపెట్టారు?
ఎక్కడ పాతిపెట్టారు? ఇలా పెరుగుతున్నాయి?

ఈ జిల్లేళ్ళనూ ముళ్ళపొదలనూ తగలేస్తే
అంటారుగదా "అయ్యో అవన్నీ ఔషధాలు
ఎప్పుడెందుకు పనికొస్తాయో అలా ఉంచండి
కొట్టేయకండి పెరగనీయండి మాటవినండి"

"ఏం వినాలి? మన మనకునేలాగే జరిగే యుగం
వచ్చి తీరుతుంది మంచిచెడ్డల మధ్య హద్దుని
మనం తెలుసుకుని ఆచరిసే ఆ కాలం లాగే!"

— డా॥ మిరియాల రామకృష్ణ